క్ష్మాండ్యాం ఖర్జూరికా ద్రుమే,

మునకును పేరు.

కూజా కలధ్వనౌ కాకే బిమ్బవాద్యవిశేషయోః.

కూజా - ॥స్త్రీ॥ ఇది మధురధ్వనికిని, కాకికిని, బింబమునకును వాద్యభేదమునకును పేరు.

బీజం రేతసి తత్త్వేఽన్నే హేతౌ వఙ్కురకారణే, బీజశ్శబ్దగుణే జ్ఞానే బలే గర్వప్రకాశయోః. ౨౮

బీజమ్-ఇది రేతస్సునకును, యథార్థమునకును, అన్నమునకును, హేతువునకును, విత్తనమునకును పేరైనపుడు ॥న॥ శబ్దగుణమునకును, జ్ఞానమునకును, బలమునకును,గర్వమునకును, ప్రకాశమునకును పేరగునపుడు ॥పు॥

తేజో బలే ప్రతాపేఽగ్నౌ త్రిషు వేతస్యథో రజః, గుణే రేణా వార్తవే

తేజః (స్) - ఇది బలమునకును, ప్రతాపమునకును, అగ్నికిని, కాంతికిని, ప్రబ్బలిచెట్టునకును పేరు.

రజః (స్)-॥న॥ ఇది రజోగుణమునకును, ధూళికిని, ముట్టు త్తురునకును పేరు.

ఽథద్విజో విప్రేఖగేరదే. ద్విజా భారీ రేణుకయో

ద్విజః-ఇది బ్రాహ్మణునికిని, పక్షికిని, దంతమునకును పేరైనపుడు॥పు॥ భారంగికిని, తక్కోలమునకును పేరగునపుడు ॥స్త్రీ॥

స్వజో నా స్వేద పుత్రయోః,నపుంసకంశోణితేఽథ బాహౌ పాణౌ భుజా ద్వయోః. ౨౯

స్వజః-ఇది చెమటకును, పుత్రునికిని, పేరైనపుడు ॥పు॥ నెత్తురునకును పేరగునపుడు ॥న॥

భుజా-॥ప్స॥ ఇది భుజమునకును, హస్తమునకును పేరు.

పీయూషపద్మయోః కఞ్జం కఞ్జో మూర్ధని వేధసి, కుఞ్జోఽస్త్రీ దన్తినాం దన్తే నికుంజే కాననే హనౌ. ౩౦

కఞ్జమ్-ఇది అమృతమునకును, కమలమునకును పేరగునపుడ ॥న॥ శిరస్సునకును, బ్రహ్మకును పేరగునపుడు ॥పు॥

కుఞ్జమ్-॥ప్న॥ ఇది ఏనుఁగులదంతములకును, పొదరిండ్లకును అడవికిని, చెక్కిలికిని పేరు.

గఞ్జా ఖన్యాం సురాగేహే భాణ్డే గారేతు పుంస్యయం,

గఞ్జా-ఇది లోహరత్నాదులుపుట్టు గనికిని, కల్లంగడికి కుండకును పేరైనపుడు ॥స్త్రీ॥ గృహమునకును పేరగునపుడు ॥పు॥

లవణాంబుజయో రబ్జం క్లీబే శంఖే తు పుంసి వా. ౩౧. పుంస్యేవ నిచుళే శీతరశ్మౌ ధన్వంతరావపి,

అబ్జమ్-ఇది ఉప్పునకును, కమలమునకును పేరగునపుడు ॥న॥ శంఖమునకు పేరగునపుడు ॥ప్న॥ గన్నేరుచెట్టునకును, చంద్రునికిని, ధన్వంతరికిని పేరగునపుడు ॥పు॥

పతాకా చిహ్న ఖట్వాఙ్గ మేఢ్రేషు ధ్వజమస్త్రియాం.

ధ్వజమ్ - ॥ప్న॥ ఇది టెక్కెమునకును, గురుతునకును ఖట్వాంగమను నాయుధమునకును, శిశ్నమునకును పేరు.

కుబ్జాధోముఖయో ర్న్యుబ్జ స్త్రిషు రోగాన్తరే తు వా,

న్యుబ్జః - ఇది మరుగుజ్జువానికిని, తలవంచుకొనినవానికి పేరగునపుడు ॥త్రి॥ రోగభేదమునకును పేరగునపుడు ॥పు॥

అజ శ్శంభౌ విష్ణు ధాత్రోః కామే ఛాగే రఘో స్సుతే. ౨౦. త్రిషు త్వనాదౌ

అజః-ఇది శివవిష్ణుబ్రహ్మలకును, మన్మథునికిని, మేఁకకును రఘుమహారాజుకొడుకునకును పేరగునపుడు ॥పు॥ మొదలులేనివానికి పేరగునపుడు ॥త్రి॥

పిఞ్జం తు బలే క్లీబం వధే పుమాన్, హరిద్రా తూలయో స్స్త్రీ స్యా ద్వాకులే త్వభిధేయవత్. ౨౧

పింజమ్-ఇది బలమునకు పేరగునపుడు ॥న॥ వధకు పేరగునపుడు ॥పు॥ పసుపునకును, ప్రత్తికిని పేరగునపుడు ॥స్త్రీ॥ తొట్రుపాటు గలదానికి పేరగునపుడు విశేష్యలింగముగలది యగును.

అథోత్తమే త్రిష్వవక్రే ఽప్యుత్పత్తిరహితే ఋజుః,

ఋజుః-॥త్రి॥ ఇది శ్రేష్ఠునికిని, వంకరముకానిదానికిని, [illegible] పుట్టుకలేనిదానికిని పేరు.

సజ్జ స్సంభృత సన్నద్ధౌ

సజ్జః-॥పు॥ ఇది నిండినదానికిని, యత్నపడువానికిని పేరు.

నిజ స్స్వీయావినాశినౌ.

నిజః-॥పు॥ ఇది తనదానికిని, నశింపనిదానికిని పేరు.

ఇతి జాన్తాః.

జాంతపదవర్గము ముగిసెను.

---

ఝంఝా ధ్వనివిశేషే స్యా దప్యసూక్ష్మామ్బువర్షణే.

ఝంఝా-॥స్త్రీ॥ ఇది ధ్వనివిశేషమునకును, సూక్ష్మముకానిదానికిని, ఉదకము వర్షించుటకును పేరు.

ఇతి ఝాన్తాః.

ఝాంతపదవర్గము ముగిసెను.

---

సంజ్ఞా నామ్న్యర్క-జాయాయాం చైతన్యే ప్యర్థసూచనే. ౨౩

సంజ్ఞా-॥స్త్రీ॥ ఇది నామధేయమునకును, సూర్యునిభార్యకును తెలివికిని, అర్థసూచనకును పేరు.

ప్రజ్ఞా ధియ త్రిష్వభిజ్ఞే త్రిష్వజ్ఞో జడ మూర్ఖయోః,

ప్రజ్ఞా-ఇది బుద్ధికి పేరగునపుడు॥స్త్రీ॥ వివేకికి పేరగునపుడు॥త్రి॥

అజ్ఞః-॥త్రి॥ ఇది తెలివిలేనివానికిని, తెలియఁజెప్పిన వినని వానికిని పేరు.

ప్రాజ్ఞీ విదుష్యాం

ప్రాజ్ఞీ-॥స్త్రీ॥ ఇది విద్వాంసునిభార్యకు పేరు.

ప్రాజ్ఞా తు ప్రజ్ఞావత్యాం త్వయం త్రిషు. ౨౪

ప్రాజ్ఞా-ఇది బుద్ధిగలదానికి పేరగునపుడు ॥త్రి॥

ఇతి ఞాన్తాః.

ఞాంతపదవర్గము ముగిసెను.

---

వటో లలాట న్యగ్రోధా
ప్రియాళు వసనే పటా.
త్వష్టారౌ దేవశిల్ప్యర్కౌ
నటా న ర్తక శోణకౌ. ౭౫
విట స్స్యా ల్లవణే షిద్గే
మూషకే ఖదిరే గిరౌ,
సృష్టి స్స్వభావే నిర్మాణే
స్యా త్పుష్టి ర్వృద్ధి పో
షయోః. ౭౬
వృష్టి ఫలే సమృద్ధౌ స్యా
ద్దృష్టి ర్ధీ దర్శ నాక్షిషు,
యష్టి ర్దణ్డే హారభేదే మ
ధుకే ప్యాయుధా న్తరే. ౭౭
దిష్టి ర్ధ్యాన సుఖానన్ద
పరిణామే
ష్వథో జటా, మాంస్యాం
మూలే లగ్నకచే
విష్టి ర్నరకపాతనే. ౭౮
బలాత్కారే చ భద్రాఖ్య
కరణే కర్మవేతనే,
సటా జటా కేసరయో
ర్ఘోంటాబదరపూగయోః.
కోటిః ప్రకర్ష చాపాగ్ర
సంఖ్యా పక్షాన్త రాశ్రిషు,
త్రుటిస్స్యా త్సంశయే లేశే
హ్రస్వేలా కాలమానయోః.
త్రోటి శ్చంచౌ కట్ఫలే చ

పటః - ॥పు॥ ఇది నొసటికిని, మఱ్ఱిచెట్టునకును పేరు.

పటః-॥పు॥ ఇది వృక్షవిశేషమునకును, వస్త్రమునకును పేరు.

త్వష్టా-॥బు-పు॥ ఇది దేవశిల్పికిని, సూర్యునికిని పేరు.

నటః-॥పు॥ ఇదినట్టువవానికిని,దుండిగపుమ్రానునకును పేరు.

విటః - ॥పు॥ ఇది ఉప్పునకును, విటునికిని, ఎలుకకును, చంద్రమ్రానికిని, కొండకును పేరు.

సృష్టిః-॥సీ॥ ఇది స్వభావమునకును, సృజించుటకును పేరు.

పుష్టిః - ఇది వృద్ధికిని, పోషించుటకును పేరు.

వృష్టి - ॥సీ॥ ఇది ఫలమునకును, సమృద్ధికిని పేరు.

దృష్టిః-॥సీ॥ ఇది బుద్ధికిని, చూపునకును, కంటికిని పేరు.

యష్టిః-॥సీ॥ ఇది కఱ్ఱకును, హారవిశేషమునకును, అతిమధురమునకును, ఆయుధభేదమునకును పేరు.

దిష్టిః-॥సీ॥ ఇది ధ్యానమునకును, సుఖమునకును, సంతోషమునకును, స్వభావమును వదిలి మఱియొకగుణమును బొందుటకును పేరు.

జటా-॥సీ॥ ఇది జటామాంసికిని, వేరునకును, వెండ్రుకల జడకును పేరు. మూలమనఁగా చెట్టుయొక్కయూడ యనికొందఱందురు.

విష్టిః-॥సీ॥ ఇది నరకమునఁబడుటకును, బలాత్కారమునకును, భద్రకరణమునకును, కూలికిని పేరు.

సటా - ॥సీ॥ ఇది జడకును, ఆకరుపూలకును పేరు.

ఘోంటా-॥సీ॥ ఇది రేఁగుచెట్టునకును, పోఁకచెట్టునకును పేరు.

కోటిః-॥సీ॥ ఇది అతిశయమునకును, వింటికొనకును, లెక్కకును, పక్షాంతరమునకును, అంచునకును పేరు.

త్రుటిః-॥పు॥ ఇది సంశయమునకును, లేశమునకును, అల్పభూమికిని, కాలప్రమాణమునకును పేరు.

త్రోటిః-॥సీ॥ ఇది పక్షులముక్కునకును, గుమ్మడిచెట్టునకును పేరు.

రేటి ర్వ్యాహ్నే శ్చ రటితం
వాణీ చాసఙ్గతోత్కటా.

పట్టి ర్లలాటభూషాయా
మపి లాక్షాప్రసాదనే,

యాగేచ్ఛాదాన దేవా
ర్చా స్విష్టిః

సృష్ట్యాదయ స్త్రిషు. ౨౩

వ్యుష్టం ప్రభాత దివసఫల
పర్యుషితే ష్వపి,

రిష్టం స్యా దశుభ క్షేమ
నాశ నిస్త్రింశ పాప్మసు.

కూటోఽస్త్రీ గిరిశృఙ్గే
యన్త్రే రాశౌ వయోఘనే
వ్యాజేఽనృతే మాయాయా
మపి సీరాఙ్గే నిశ్చలేచ పా
పేచ. ౨౪

ఖేటః కఫ కుత్సితయో
ర్గ్రామే ఫలే గుడవికారే చ,
శ్రోణ్యాం భృశే కళింగే
గజగండే శపథే శవే చ క
టః. ౨౫

కటు స్త్రీ కరసే క్షారరసే
నా తద్వతి త్రిషు, సుగన్ధి
మ త్పరాకా ర్యాప్రియ తీ
క్ష్ణే ష్వపి త్రిషు. ౨౬. కటు
స్త్రీ(న్) కటురోహిణ్యాం దూ
షణే తు నపుంసకమ్,

ఘటః కుమ్భే సమాధౌచ
ఘటా తు గజసంహతౌ.
ఘటనాయాంచ గోష్ఠ్యాంచ

కుట స్తు ఘటవేశ్మనోః,
కుటి స్త్రీ(న్) స్యా త్కుమ్భ

రేటిః - ॥స్త్రీ॥ ఇది అగ్నియందు బుట్టుధ్వనికిని, ఒకదానిత్
జేరక మిక్కిలి విస్తారమయిన వాక్కునకును పేరు.

పట్టిః - ॥స్త్రీ॥ ఇది నొసటఁగట్టుసొమ్మునకును, ఎఱ్ఱి లొద్ద
చెట్టునకును పేరు.

ఇష్టిః-॥స్త్రీ॥ ఇదియాగమునకును, ఇచ్ఛకును, దానమునకు
దేవపూజకును పేరు.

సృష్టిశబ్దము మొదలు ఈ ౧౭ శబ్దములును త్రిలింగము

వ్యుష్టమ్-॥న॥ ఇది ప్రాతఃకాలమునకును, దినమునకు
ఫలమునకును, చద్దికిని పేరు.

రిష్టమ్-॥న॥ ఇది అశుభమునకును, క్షేమమునకును, నాశ
నకును, కత్తికిని, పాపమునకును పేరు.

కూటః-॥పు॥ ఇది పర్వతశిఖరమునకును, మృగాదులహిం
చునట్టి యంత్రములు మొదలగు సాధనములకును, రాశికి
సమ్మెటకును, కపటమునకును, బొంకునకును, ఇంద్రజాల
మొదలగు మాయలకును, నాఁగేటికఱ్ఱునకును, కదలనియా
శము మొదలయినవానికిని, పాపమునకును పేరు.

ఖేటః-॥పు॥ ఇది కఫమునకును, కుత్సితమునకును, గ్రామ
నకును, డాలునకును, బెల్లముయొక్క వికారమునకును పేరు.

కటః - ॥పు॥ ఇది పిరుఁదునకును, ఎక్కువకును, కూఁక
మూఁగయను పక్షికిని, ఏనుఁగు గండస్థలమునకును, ఒట్టునకు
శవమునకును పేరు.

కటుః-ఇది చేదునకును, ఉప్పునైనరసమునకును, ఒట్టునకు
॥పు॥ ఆచేఁదు నుప్పనయుఁగల వస్తువులకుఁ బేరగునపుడు ॥త్రి
పరిమళముగలదానికిని, పరులసంపద నోర్వమికిని, అకార్య
నకును, అనిష్టమునకును, తీక్ష్ణమునకును పేరగునపుడు ॥త్రి
కటుకరోహిణికిఁ బేరగునపుడు॥స్త్రీ॥దూషించుటకు పేరగునపు
॥న॥

ఘటః-ఇది కడవకును, సమాధికిని పేరగునపుడు ॥పు॥ ఏ
గు గుంపునకును, కూర్చుటకును, సభకును పేరగునపుడు ॥స్త్రీ॥

కుటః - ॥పు॥ ఇది కడవకును, గృహమునకును పేరు.

కుటిః - ॥స్త్రీ॥ ఇది నీళ్లమోయుం బానిసెకును, గుడిసెకు

్యా మల్పవేశ్మని చా
రా
స్త్వట్టాలకే పూరే
ష్కేఽవ్యయం త్రి
ష్టం త్వన్నేఽ

ృష్టి స్త్రీ(?) కర్షణే
తు నా. ర్ణా
ర ప్రసూతా గౌర్ఘు
) సూకరే తు నా,
దైవ పరీణా మానన్దే
యే తు నా. కాం
త్రిషు పటు స్తీక్ష్ణే
నిపుణేఽపి చ,
తీరభృగూ
స్త్యక్త నిశ్చిత నిర్మి
కాం
హూశంసి తే దత్తే హు
యో రపి,
మ్లానా స్పష్టవాచా
ంఫుల్ల యో స్స్ఫ
కా
ఇతి టాన్తాః.

---

వాచకశబ్దే స్యా
నే గళే ధ్వనౌ,
ు నాశే నిష్పత్తా
త్పర్యయాచ్ఞయోః.
చరమమాత్రే చ
ృరమే చ తత్,
త్వలక్ష్మీ నక్షత్ర

నానార్థ—5

నామధేయములు.

అట్టః-ఇది బురుజుమీఁదనయినను, వాఁకిటిమంటపముమీఁద నయినను, యుద్ధము చేయుటకై కట్టినయింటికిని, ప్రవాహము నకును, మిక్కిలి యెండినవానికిని పేరగునపుడు ॥త్రి॥ అన్నము నకు పేరగునపుడు ॥న॥

కృష్టిః-ఇది దున్నుటకు పేరగునపుడు ॥స్త్రీ॥ పండితునికి పేరగు నపుడు ॥పు॥

ఘృష్టిః-ఇది ఒకతూరి యీనినయావునకు పేరగునపుడు ॥స్త్రీ॥ పందికి పేరగునపుడు ॥పు॥

దిష్టమ్-ఇది దైవమునకును, పరిపక్వమునకును, సంతోషము నకును పేరగునపుడు ॥న॥ కాలమునకు పేరగునపుడు ॥పు॥

పటుః-॥త్రి॥ ఇది తీక్ష్ణమయినదానికిని, రోగము లేనిదానికిని, సమర్థమయిన దానికిని పేరు.

తటమ్-॥పు॥ ఇది గట్టునకును, కొండచఱియకిని పేరు.

సృష్టః-॥పు॥ ఇది విడువఁబడినదానికిని, నిశ్చయింపఁబడిన దానికిని, చేయఁబడినదానికిని పేరు.

ఇష్టమ్-॥న॥ ఇది చెప్పఁబడినదానికిని, ఇయ్యఁబడినదానికిని, హోమము చేయఁబడినదానికిని, పూజింపఁబడినదానికిని పేరు.

మ్లిష్టః-॥పు॥ ఇది వాడినదానికిని, స్ఫుటము కాని మాటకును పేరు.

స్ఫుటః-॥పు॥ ఇది ప్రకాశమైనదానికిని, వికసించినదాని కిని పేరు.

టాంతపదవర్గము ముగిసెను.

---

కంఠః-॥పు॥ ఇది అర్థముగలశబ్దమునకును, సమీపమునకును, కంఠమునకును, ధ్వనికిని పేరు.

నిష్ఠాః-॥స్త్రీ॥ ఇది నాశమునకును, కలుగుటకును, తుదకును, తాత్పర్యమునకును, యాచనకును పేరు.

పృష్ఠమ్-॥న॥ ఇది తుదకును, శరీరముయొక్క వెనుకప్రక్క కును పేరు.

జ్యేష్ఠాః- ఇది అలక్ష్మికిని, జ్యేష్ఠానక్షత్రమునకును, బల్లికిని

గృహ గోధాసు మాసి నా.

పేరగునపుడు ॥సీ॥ జ్యేష్ఠమాసమునకు పేరగునపుడు ॥పు॥

అయం వృద్ధతమ శ్రేష్ఠ
పూర్వజేషు త్రిలింగకః,

ఈజ్యేష్ఠశబ్దము మిక్కిలి ముసలివానికిని, శ్రేష్ఠునికిని, అన్న
కును పేరగునపుడు ॥త్రి॥

సభాసల్లాపయో ర్గోష్ఠి
గోష్ఠం గోస్థానకే భవేత్.

గోష్ఠిః-ఇది సభకును, ఏకాంతమున మాటలాడుటకును పేర
నపుడు ॥సీ॥ ఆవులదొడ్డికి పేరగునపుడు (గోష్ఠ) ॥న॥

శ్రేష్ఠో నా ధనదే వర్యే
త్రిషు

శ్రేష్ఠః-ఇది కుబేరునికిని పేరగునపుడు ॥పు॥ శ్రేష్ఠమైనదాని
పేరగునపుడు ॥త్రి॥

కాష్ఠం చ దారుణి, కాష్ఠా
దర్వ్యాం కాలభేదే ప్రక
ర్షే దిశి సామ్నిచ. ౯౬

కాష్ఠమ్-ఇదికొయ్యకు పేరగునపుడు ॥న॥ కొయ్యతెడ్డునకున
కాలభేదమునకును, అతిశయమునకును, దిక్కునకును, సా
వేదమునకును పేరగునపుడు ॥సీ॥

కుక్షే రన్త ర్గృహ స్యా
న్తః కుసూలే కోష్ఠ మస్త్రి
యామ్,

కోష్ఠమ్-॥ప్న॥ ఇది లోనికడుపునకును, లోయింటికిని, గా
దెకును పేరు.

పాఠో నా పఠనే పాఠా
విద్ధకర్ణ్యాం

పాఠః-ఇది పఠించుటకుఁ బేరగునపుడు ॥పు॥ అగరుశొంఠి
పేరగునపుడు ॥సీ॥

మఠా మఠే. ౯౭. గదే
చ కుష్ఠ మస్త్రీ స్యా

కుష్ఠమ్-॥ప్న॥ ఇది చెంగల్వకోష్ఠునకును, కుష్ఠవ్యాధికిని పేరు.

త్ప్రేష్ఠ స్త్రిష్వగ్రగే

ప్రేష్ఠః-॥త్రి॥ ఇది మొదటివానికిని, శ్రేష్ఠునికిని పేరు.

వరే, కుంఠ స్స్యా దకృ
తో ద్వాహే ఖర్వే ప్యనిశి
తాయుధే. ౯౮

కుంఠః-॥పు॥ ఇది వివాహముచేసుకొనినవానికిని, పొట్టివా
కిని, వాడిలేనియాయుధముగలవానికిని, అపిశబ్దమువలన కార్య
ములయందు మందుఁడగువానికిని పేరు.

ఇతి ఠాంతాః.

ఠాంతపదవర్గము ముగిసెను.

---

గణ్డో వ్రణే కపోలే
పిటకే గర్వే మృగాన్తరే
యోగే, మూలాదిదుష్టభా
గే మాయభూషణే బుద్బుదే
ఉప్యుపాయే చ. ౯౯

గండః-॥పు॥ఇది వ్రణమునకును, చెక్కిలికిని, బొబ్బలకును
గర్వమునకును, ఖడ్గమృగమునకును, గండనామయోగము, గండ
దోషమునకును, గుబ్బపు సొమ్ములకును, నీరుబొబ్బలకును, ఉపా
యమునకును పేరు. అపిశబ్దమువలన గండశిలకును పేరు.

దణ్డీ ద్వార్థ్స్థే యమే పిణ్డ
స్థగనే తిలకల్కకే,

దండి(న్)-॥పు॥ ఇది ద్వారపాలకునికిని, యమునికిని, పింద
ము నంటినరోగమునకును, గానుగపిండికి బేరు.

చోడా కంచులికా దేశా

చోడః-॥పు॥ ఇది రవికెకును, అజ్ఞకును బేరు.

వ్యాడా హింస్రపశూరగౌ.

వ్యాడః-॥పు॥ ఇది హింసించుదుష్టపశువునకును, సర్పము

నకును పేరు.

వ్యథాకరుణయో
ల్యాపగర్వయోః,
నాళ ఘటీ దూర్వా
స్వంగసిరాసు చ.
వా గ్గో ద్యు భూనా
హా స్యా ద్బుధప

పీడాః-॥సీ॥ ఇది బాధకును, దయకును, శిరస్సునం జుట్టు పుష్పమాలికకును, గర్వములేనివానికిని పేరు.

నాడీః - ॥సీ॥ ఇది పయిరుకాండకును, కడవకును, దూర్వా ను, నారికురుపునకును, శరీరమునంబుట్టిన నరములకును పేరు.

ఇడాః-॥సీ॥ ఇది వాక్కునకును, గోవునకును, స్వర్గమునకును భూమికిని, ప్రేవులకును, బుధునిభార్యకును పేరు.

కరికరే మధ్యే
వారయోషితి.
ర్తృకనారీ తు రణ్డా
పర్ణ్యపి,
ముష్కే విహం

తు మార్జనే.౧౦౩
ధనేఽ మత్రే భూ
శ్వభూషణే,
ర్ణ్వ్రపే గదే శ్వే
గా గుణిని త్రిషు.
౧౦౪

శుండాః-॥సీ॥ ఇది ఏనుగుతొండమునకును, మధ్యభాగము నకును, తామరకొలనుకును, వేశ్యకును పేరు.

రండాః - ॥సీ॥ ఇది పెనిమిటిచచ్చిన స్త్రీకిని, ఎలికచెవి చెట్టునకును బేరు.

అండమ్ - ॥న॥ ఇది వృషణమునకును, పక్షులు మొదలయిన వాని గ్రుడ్డునకును బేరు.

భాండః - ॥న॥ ఇది మద్దెలకుండకును, వర్తకము చేయుటకై యుంచిన మొదటిసొమ్మునకును, పాత్రమునకును, భూషణము నకును, గుఱ్ఱపుసొమ్మునకును బేరు.

పాండుః - ఇది పాండురాజునకును, పాండురోగమునకును, తెల్లనిగుణమునకు బేరగునపుడు ॥పు॥ గుణముగలదానికి బేరగు నపుడు ॥త్రి॥

దైత్యాంతరే రా
రార్థి౨ త్రిషు తు

ముండః-ఇది రాక్షసునికిని, రాహువుకును, శిరస్సునకును బేరగునపుడు ॥పు॥ బోడితలవానికి బేరగునపుడు ॥త్రి॥

విఖ్యాతయో శ్శౌ
పుంసి తు కుక్కు
౧౦౫

శౌండః - ఇది మంత్రమునకును, ప్రసిద్ధునికిని బేరగునపుడు ॥త్రి॥ కోడికి బేరగునపుడు ॥పు॥

ర్జలదపఙ్క్తౌ చపిప్ప
గా రపి,
మస్త్రీ మణే ర్దో
కేక్షువికారయోః.
స్నుహీగుళికయో
క్ష్ణేత్పుపాకయోః,

శౌండీః-॥సీ॥ఇది మేఘపంక్తికిని, పిప్పలికిని, చవ్యమునకు ను బేరు.

ఖండమ్-॥ప్న॥ ఇది మణులయొక్క దోషమునకును, తునుక కును, కండచక్కెరకును బేరు.

గుడాః - ఇది జెముడుచెట్టునకును, గుళికకును బేరగునపు డు॥సీ॥ పిండమునకును, బెల్లమునకును బేరగునపుడు ॥పు॥

జడ స్త్వజ్ఞే బుద్ధిహీనే హిమగ్రస్తేఽపివాచ్యవత్.
శాకశింబ్యాం జడా

జడః-ఇది జాగ్రతలేనిమందునికిని, బుద్ధిహీనునికిని, తఁ గొట్టువడినవానికిని పేరగునపుడు విశేష్యలింగము. డికి పేరగునపుడు ॥న॥

నీడ మస్త్రీ స్థాన కులాయ యోః,

నీడమ్-॥ప్న॥ఇది స్థానము,పక్షియొక్కగూఁడు వీని

క్రోడో నా సూకరే క్లీబ ముత్సంగే వక్షసి ద్వయోః.

క్రోడః - ఇది పందికిపేరగునపుడు ॥పు॥ ఒడికిపేర ॥న॥ రొమ్మునకు పేరగునపుడు ॥ప్న॥

క్ష్వేడా వేణు శలాకా యాం సింహనాదేఽపి చ స్త్రియామ్, క్ష్వేడో వా పుంసి గరళే ధ్వనా రక్తా ర్కపాదపే. ౧౦౯

క్ష్వేడాః-ఇది వెదురుతూలికెకును, సింహనాదము గునపుడు ॥స్త్రీ॥ విషమునకును, ధ్వనికిని, ఎఱ్ఱజిల్లేడు చె పేరగునపుడు ॥పు॥

బాణావసర గ్రంథి స్తంభ రహో వాజి వారి వర్గేషు, స్కన్ధే చ భూరుహాణాం గర్వే నాళే బలే చ కాణ్డో ఽస్త్రీ. ౧౧౦

కాండః-॥ప్న॥ ఇది బాణమునకును, సమయమునకు పునకును, స్తంభమునకును, ఏకాంతమునకును, గుఱ్ఱ ఉదకమునకును, గుంపునకును, మ్రానియొక్క వ్రేళ్లు కొని కొమ్ములవఱకుగల మధ్యభాగమునకును, గర్వ ఊఁచకును, బలమునకును పేరు.

చండో దైత్య విశేషే యమదాసే త్రిషు తు తీవ్ర కోపనయోః, చణ్డీ గౌర్య

చండః - ఇది చండుఁడనురాక్షసునకును, యమ పేరగునపుడు ॥పు॥ తీవ్రముగలవానికిని, మిక్కిలి కో కును పేరగునపుడు ॥త్రి॥ గౌరికి పేరగునపుడు (చండీ

థ మస్తుని మణ్డ మసౌ సారపింఛయోః పుంసి.

మండమ్-ఇది మీఁగడకు పేరగునపుడు ॥న॥ సత్తున మలిపింఛమునకును పేరైనపుడు ॥పు॥

కుణ్డం పిఠరే తోయా ధారవిశేషేచ వహ్నిగర్తేచ, కుండో జారా జ్జాత స్సభ ర్తృకాయాం

కుండమ్-ఇది కుండ, ఉదకపాత్ర, అగ్నికుండ నామమయ్యేనేని ॥న॥ రంకులాడికి మగండుండఁగ జా గలిగిన తనయునికి నామమయ్యేనేని ॥పు॥

కమణ్డలుః కుణ్డీ. ౧౧౨

కుండీః - ॥స్త్రీ॥ ఇది కమండలమునకుఁ బేరు.

దండోఽస్త్రీ దమహింసా సేనా లగుడేషు శాసనే రాజ్ఞామ్, దణ్డో మానవిశేషే వ్యూహే రవిపారిపార్శ్వ కే పుంసి. ౧౧౩

దండః - ఇది శిక్షించుట, హింసించుట, సేవ, ద రాజాజ్ఞ, కప్పు, కోలత, గుంపు వీనికి నామమయ్యే సూర్యపార్శ్వవర్తికి నామమయ్యేనేని ॥పు॥

ండో వపుషి నివాపే
ళే పృథ పిణ్డ మయసి
ృశిశౌ, ఆజీవనే

డుస్తు త్రిషు కుబ్జే పుంసి
పుష్ట్యోః. ౧౧౪
ణ్డ షణ్డే వర్ష్మధరే గోప
వధ్యపూరుషే.

ఇతి డాన్తాః.

---

ఢదంష్ట్రా చ్ఛ యో
ఢా సుతే నా ధర్తరి
షు. ౧౧౫
ాఢం రహసి గుహ్యా
బే త్రిషుతు సంవృతే,
ఢం త్రిషు దృఢే క్లీబ
మత్యా
ఢ త్రిషు. ౧౧౬. మూ
జ్ఞే మూర్ఛితే
ూఢం విన్యస్తే సంహతే
,
ఢా బలి స్థూల గాఢా

సిఢా శక్తిమావతోః.
ఇతి ఢాన్తాః.

---

ార్వే సూద వృకోదర
త్వావృత్తీన్ద్రియేషు రూ
ా, సత్వాదౌ సంధ్యా
త్యాగాదా వప్రధానే
ణాః. ౧౧౭

పిండః–ఇది శరీరము, పితృదేవతలను గూర్చి జేయు దానాదులు, మన్ను మొదలైనవానిచేతఁ జేయఁబడిన యుంటలు వీటికి నామమయ్యేనేని ॥పు॥ ఇనుము, గర్భముననున్న శిశువు, కడుపు కూటికిని పేరగునపుడు ॥న॥

గడుః–ఇది మఱుగుజ్జువానికి నామమయ్యేనేని ॥త్రి॥ కణితికిని, పుష్టికిని నామమయ్యేనేని ॥పు॥

షండః–॥పు॥ ఇది నపుంసకుఁడు, వృషణహీనుఁడు, ఆఁబోతు, చంపఁదగిన తప్పుచేసినవానికి పేరు.

డాంతపదవర్గము ముగిసెను.

---

వోఢాః–ఇది గాఢమయినకోరకును, స్వచ్ఛమైనదానికిని, పుత్రునికిని బేరయ్యేనేని ॥పు॥ బరువుమోయువానికి నామమయ్యేనేని ॥త్రి॥

గూఢమ్–ఇది రహస్యము, గుహ్యదేశము–వీనికి నామమయ్యేనేని ॥న॥ దాఁగినదానికిఁ బేరైనపుడు ॥త్రి॥

బాఢమ్–ఇది దృఢమైనదానికి నామమయ్యేనేని ॥త్రి॥ అనుమతికి నామమయ్యేనేని ॥న॥

మూఢః–॥త్రి॥ ఇది మూఢునకు, మూర్ఛగలవానికిని పేరు

వ్యూఢమ్–॥న॥ ఇది ఉంపఁబడినదానికిని, కూడినదానికిని, ఊరిచుట్టువేసిన కంపవెలుగునకును నామము.

దృఢః–॥పు॥ ఇది బలవంతునికిని, లావువానికిని, దట్టమైనదానికిని బేరు.

సోఢాః–॥పు॥ ఇది సమర్థునకు, ఓర్పుగలవానికిని బేరు.

ఢాంతపదవర్గము ముగిసెను.

---

గుణః–॥పు॥ ఇది వింటినారికిని, వంటవానికిని, భీమునకును, దారమునకును, పలుమారు చెప్పుటకును, ఇంద్రియమునకును, రూపాదిగుణములకును, సత్వరజస్తమస్సులకును, సంధివిగ్రహాది షడ్గుణములకును, పక్షాంతరమున వ్యాకరణశాస్త్రమునఁ జెప్పియున్న గుణమను పేరుగలసంధికిని, త్యాగాదిగుణములకును, అప్రధానకార్యమునకును నామము.

వ్యవహారే భృతిధనయోః
పూలీషుచ విక్రయార్హ్యేశా
కాదేః, మూల్యే వరాటే
మానే ద్యూతే కార్షాపణే
గ్లహే చ పణః. ౧౧౯

పణః-॥పు॥ ఇది వ్యవహారమునకు, కూలికిని, ధనమున
ముద్రగలవరాకు, విక్రయయోగ్యమగువస్తువుల క్రయమున
గుడ్డిగవ్వకు, ప్రమాణమునకు, ద్యూతమునకు, పదియాఱు గ
గింజల యెత్తుగల వెండిటంకమునకు, జూదమందలి పందెమున
చకారమువలన రెండున్నరయెత్తుగల రాగిముద్రకును నామమ

వ్యాపార వికలతాయా
ముత్సవ పరతంత్రతా ము
హూర్తేషు, పరమాణు కాల
భేదే ఘటీషడంగే క్షణ
స్తథావసరే. ౧౨౦

క్షణః-॥పు॥ ఇది వ్యాపారములేకయుండుటకు, ఉత్సవ
నకు, పరాధీనమగుటకు, అహోరాత్రకాలమున ముప్పదవభాగ
నకు, పరమాణువునకు, సమానమయిన స్వల్పకాలమునకు, ఒ
గడియకాలమున నాఱవభాగమునకు, సమయమునకు నామమ

సైన్యభేదే సమూహేచ
సంఖ్యాయాం ప్రమథే గ
ణః,

గణః-॥పు॥ ఇది ౨౭ ఏనుఁగులు, ౨౭ రథములు, ౮౧ గు
ములు, ౧౩౫ కాలుబంట్లునుగల దండునకు, సమూహమున
లెక్కకును, నంది మొదలయిన ప్రమథగణములకును నామమ

శ్రోత్రరాధేయయోః కర్ణః

కర్ణః-॥పు॥ ఇది చెవికిని, కర్ణునకును నామము.

కోణోఽశ్రౌలగుడేఽర్కజే.
వీణాదివాదనోపాయే వాద్య
గేహైకదేశయోః,

కోణః-॥పు॥ ఇది అంచునకును, దుడ్డుకోలకును, శనికి
వీణాదులవాయించుకోడుపునకును, వాద్యగృహమునకును, ఏ
మూలకును నామము.

దేవేఽర్కే తర్ణి

తర్ణిః-॥పు॥ ఇది దేవునకును, సూర్యునకును నామము.

రర్కాగ్న్యోర్జూర్ణి

జూర్ణిః-॥పు॥ ఇది సూర్యునకును, అగ్నికిని నామము.

రగ్న్యర్చిషోర్ఘృణిః.

ఘృణిః-॥పు॥ ఇది అగ్నికిని, జ్వాలకును నామము.

వృష్ణిస్తు యాదవే మేషే
పాషండే హిమదీధితౌ,

వృష్ణిః-॥పు॥ ఇది వార్ష్ణేయునకును, గొఱ్ఱెకును, పాషం
నకును, చంద్రునకును నామము.

శాణః కర్షోపలే మాషచ
తుష్కే కరపత్రకే. ౧౨౩

శాణః-॥పు॥ ఇది ఒరగంటికిని, ౨౦ గురిగింజలయెత్తున
రంపమునకును నామము.

దేహాన్తరానిలే ప్రాణో
జీవాత్మ పరమాత్మనోః, ఆ
యు రిన్ద్రియసత్వేషు ప్రణ
వే కార్యమర్మణి. ౧౨౪

ప్రాణః-॥పు॥ ఇది దేహమునందలి ప్రాణవాయువునకు
జీవునకును, పరమాత్మకును, ఆయువునకును, ఇంద్రియమునకు
బలమునకును, ప్రణవమునకును, కార్యరహస్యమునకును నామ

భ్రూణోఽర్భకే స్త్రైణ
గర్భే గర్భిణ్యాం శ్రోత్రి
యే ద్విజే,

భ్రూణః-॥పు॥ ఇది పిన్నవానికిని, స్త్రీలగర్భమునకును, గరి
స్త్రీకిని, వేదవేత్తకును, బ్రాహ్మణులకును నామము.

ఊర్ణా భ్రూమధ్య మావ

ఊర్ణా-॥స్త్రీ॥ ఇది కనుబొమ్మలనడుమనుండు సుడికిని,

ర్తే తన్త్రా మేషాదిలోమసు. ౧౨౭

వేణిః ప్రవాహే సరితాం మే
నే కేశబన్ధనే, దేవశాణ్డే
వ్యథ స్థూణే స్తమ్భాయః
ప్రతిమే స్త్రియాం. ౧౨౮
వీణా తటిచ్చ

ఘోణా తు నాసికా రథ
ణ్డికా,
ఘృణా జుగుప్సాకృపయో
స్తృష్ణాత్వీహాపిపాసయోః.
వర్ణ స్స్వర్ణ కథా కుథనుతి
ణ శోభా యశోవిశేషేషు,
తిక్రమే ద్విజాదౌ శుక్లా
చాక్షరేషు వర్ణం వా.
కణా జీరకపిప్పల్యోః క
ధాన్యాంశలేశయోః,
ద్రోణః కృపీపతౌ కాకే
కవృశ్చికయో శ్చ నా.
స్త్ర్యాఢకచతుష్కే చ
ద్రోణీ కాష్ఠాంబువాహినీ,
బాణౌ దైత్యశరౌ చాథ
యో ర్నీలీ కురణ్టకే.
౧౩౦
తీక్ష్ణం క్లీబే విషే యుద్ధే
ముద్రలవణాయసోః, త్రి
తిగ్మే తుతే క్షారే
శోణ స్త్వరళుపాదపే.
వేఽగ్నౌ రక్తతురగే రాగే
తద్వతి త్రిషు,
మార్ణో గద్యే స్త్రియాం

మునకును, గొఱ్ఱె కుందేలు ఎలుక మొదలయినవాని వెండ్రు
కలకును నామము.

వేణిః-॥స్త్రీ॥ ఇది ప్రవాహమునకును, నదులుగూడుటకును
జెడకును, సమర్థుడైన దేవతకును నామము.

స్థూణా:-॥స్త్రీ॥ ఇది స్తంభమునకును, ఇనుపప్రతిమకున
నామము.

వీణా:-॥స్త్రీ॥ ఇది మెఱుపునకును, చకారమువలన వీణెకును
నామము.

ఘోణాః-॥స్త్రీ॥ ఇది ముక్కునకును, రథచక్రముయొక్క
కుండకును నామము.

ఘృణాః-॥స్త్రీ॥ ఇది రోతకును, దయకును నామము.

తృష్ణాః-॥స్త్రీ॥ ఇది ఆశకును, దాహమునకును నామము.

వర్ణః-ఇది పైడికిని, కథకును, ఏనుఁగువీపునవేయు రత్నకం
బళికిని, స్తుతికిని, గుంపునకును, కాంతికిని, కీర్తికిని నామమయ్యె
నేని ॥పు॥ గానమునకును, బ్రాహ్మణాదిజాతులకును, శుక్లాది
వర్ణములకును, అక్షరమునకును నామమయ్యెనేని ॥న్న॥

కణాః-ఇది జీరకమునకును, పిప్పలికిని నామమయ్యెనేని ॥స్త్రీ॥
నూకలకును, కొంచెమైనదానికిని నామమయ్యెనేని ॥పు॥

ద్రోణః-ఇది ద్రోణాచార్యునకును, మాలకాకికిని, కప్పకును,
తేలునకును నామమయ్యెనేని ॥పు॥ నలుదూములకు నామ
మయ్యెనేని ॥న్న॥

ద్రోణీః-॥స్త్రీ॥ ఇది దోనెకు నామము.

బాణః-ఇది బాణాసురునకును, బాణమునకును నామమయ్యె
నేని ॥పు॥ నల్లపువ్వులగోరింటకును, పచ్చపువ్వులగోరింటకును
నామమయ్యెనేని ॥స్త్రీ॥

తీక్ష్ణమ్-ఇది విషయమునకును, యుద్ధమునకును, సముద్రల
వణమునకును, ఇనుమునకును నామమయ్యెనేని ॥న॥ వేఁడికిని,
తుమ్మునకును, గాఱుప్పునకును నామమయ్యెనేని ॥త్రి॥

శోణః-॥పు॥ ఇది దుండిగపుమ్రానికిని, శోణనదమునకును,
అగ్నికిని, ఎఱ్ఱగుఱ్ఱమునకును, ఎఱుపునకును నామము. ఎఱుపుగల
దానికిని నామమయ్యెనేని ॥త్రి॥

చూర్ణః-॥పు॥ ఇది చూర్ణికకు నామమయ్యెనేని॥ స్త్రీ॥ పొడికిని,

చూర్ణం క్షోదే క్షారాన్త
రేఽపి తత్. ౧౩౨. పర్పా
టకే స్త్రియాం
రేణు ర్ద్వయో ర్ధూళ్యా
మణు స్తునా, ధాన్యభేదే
త్రిషు స్వల్పే
రణోఽస్త్రీ యుధి నా ధ్వ
నౌ. ౧౩౩
మణి ర్ద్వయోరజాకణ్ఠస్త
నే రత్నేప్యళిఞ్జలే,
మేహనాగ్రే తు నాసా
యాం ఘ్రాణం ఘ్రాతే
త్వయం త్రిషు. ౧౩౪
పార్ష్ణి రున్మత్త నార్యాం
స్త్రీ నా త్వయం గుల్ఫయో
రధః, పశ్చాద్భాగే సైన్య
పృష్ఠే
జిష్ణు స్తు త్రిషు జిత్వరే.
౧౩౫. పార్థేన్ద్రయో ర్నా
పర్ణం తు పత్రే పుంసి తు
కింశుకే,
శ్రేణి ర్ద్వయో స్సజాతీ
యశిల్పిసంహతి రావళిః.
ద్వయో రాణి రణి శ్చా
సౌ సీమ న్యక్షేఽగ్రకీలకే,
స్థాణుః పుమాన్ మహాదేవే
శఙ్కౌ వస్త్రీ స్థిరే త్రిషు.
శ్రాణా యవాగ్వాం పక్వే
తు త్రిషూ
ష్ణ స్త్వాత పోష్మణోః,
జహన్నా తు పుంసి చతుర

సన్నమునకును నామమయ్యేనేని ॥న॥ పర్పాటకమునకు నామ
మయ్యేనేని ॥స్త్రీ॥

రేణుః-॥ద్వ॥ ఇది దుమ్మునకు నామము.

అణుః-ఇది చిరువడ్లకు నామమయ్యేనేని ॥పు॥ అల్పమైన
దానికి నామమయ్యేనేని ॥త్రి॥

రణః-ఇది యుద్ధమునకును నామమయ్యేనేని ॥పు॥ ధ్వనికి
నామమయ్యేనేని ॥పు॥

మణిః-॥ద్వ॥ ఇది మేఁక మెడచంటికిని, రత్నసామాన్యము
నకును, కాఁగునకును నామము.

ఘ్రాణమ్-ఇది శిశ్నముయొక్క కొనముక్కునకు నామ
మయ్యేనేని॥న॥మూర్కొనఁబడినదానికి నామమయ్యేనేని ॥త్రి॥

పార్ష్ణిః-ఇది వెఱ్ఱిపట్టిన స్త్రీకి నామమయ్యేనేని ॥స్త్రీ॥ కాలి
మడిమెకును, వెనుకప్రక్కకును, సేనయొక్క పృష్ఠభాగమునకును
నామమయ్యేనేని ॥పు॥

జిష్ణుః-ఇది గెలుచు స్వభావముగలవానికి నామమయ్యేనేని
॥త్రి॥ అర్జునునికిని, ఇంద్రునికిని నామమయ్యేనేని ॥పు॥

పర్ణమ్-ఇది పత్రమునకు నామమయ్యేనేని ॥న॥ మోదుగ
చెట్టునకు నామమయ్యేనేని ॥పు॥

శ్రేణిః-॥ద్వ॥ ఇది భేదములేని కార్యసమూహమునకును,
పంక్తికిని నామము.

ఆణిః, అణిః-॥ద్వ॥ ఈ రెండును ఎల్లకును, బండియొక్క
యిరుసునకును, కడపట బండికన్ను జారకుండుటకై యుంచిన
చీలకును నామము.

స్థాణుః-ఇది శివునకునామమయ్యేనేని ॥పు॥ మేఁకునకు నామ
మయ్యేనేని ॥ద్వ॥ స్థిరమైనదానికి నామమయ్యేనేని ॥త్రి॥

శ్రాణాః-ఇది గంజికి నామమయ్యేనేని ॥స్త్రీ॥ పక్వమునకు
నామమయ్యేనేని ॥త్రి॥

ఉష్ణః-ఇది ఎండకును, వేఁడికిని, అగ్నికిని నామమయ్యేనేని
॥పు॥ సమర్థునకును, వేఁడిగలదానికిని నామమయ్యేనేని విశేష్య

తిగ్మయో స్త్వేష వాచ్యవత్.

వ్యాసార్జునాగ్ని హరి కోకిల కాక శూద్ర తామిస్రవక్ష కరి నీలగుణేషు కృష్ణః, ద్రవ్యేత్రిషు ద్రుపదజా తటినీ కణాసు కృష్ణా థ లోహమరిచే దురితంచ కృష్ణమ్. ౧౩౯

లింగము.

కృష్ణః-ఇది వ్యాసముని, అర్జునుఁడు, అగ్ని, విష్ణువు, కోకిల కాకి, శూద్రుఁడు, కృష్ణపక్షము, ఏనుఁగు, నీలగుణమునకు పేరగునపుడు ॥పు॥ నలుపుగల ద్రవ్యమునకు నామమయ్యేనేని ॥త్రి॥ ద్రౌపది, కృష్ణానది, నల్లజీలకఱ్ఱకు పేరగునపుడు ॥స్త్రీ॥ ఇనుము మిరియము, పాపమునకు నామమయ్యేనేని ॥న॥

ఇతి ణాన్తాః.

ణాంతపదవర్గము ముగిసెను.

---

వసాదయ స్సప్త కఫాదయ స్త్రయో భూతాని పంచ స్వగుణా శ్చ గైరికమ్, శిలావికా రేంద్రియ శబ్దయోనయో లోహం స్వభావః కనకం చ ధాతవః. ౧౪౦

ధాతుః - ॥పు॥ ఇది వసాదులు (అనఁగా నన్ని మాంసము లో మేలైన క్రొవ్వు, నెత్తురు, మాంసము, మెదడు, ఎముక పులిసీరు, రేతస్సు, ఈయేడింటికి) కఫ, వాత, పిత్తము లనుమూడింటికి, పృథివి, అప్పు, తేజము, వాయువు, ఆకాశము అననీపంచభూతములు. వానిగుణములగు గంధరసరూపస్పర్శశబ్దములు, జేగురు, మనశ్శిలా హారితాళ గంధకములు మొదలైన శిలావికారము, త్వక్చక్షుశ్శ్రోత్ర జిహ్వాఘ్రాణములు పంచేంద్రియములు శబ్దకారణములైన భ్వాదిధాతువులు, ఇనుము మొదలైన లోహజాతి, స్వభావము, బంగారమునకు పేరు.

కేతుర్గ్రహే ధ్వజేచిహ్నే కిరణోత్పాత వహ్నిషు,

కేతుః - ఇది కేతుగ్రహము, టెక్కెము, గుఱుతు,కిరణము ధూమకేతువు మొదలైనయుత్పాతకములకును, అగ్నికిని పేరు

మర్త్యాపరాధయో ర్మంతుః

మంతుః - ॥పు॥ ఇది మనుష్యుఁడు, అపరాధమునకును పేరు

కంతుః కామకుసూలయోః.

కంతుః - ॥పు॥ ఇది మన్మథుఁడు, గాదెకును నామము.

క్రతు ర్మున్యంతరే యజ్ఞే

క్రతుః - ॥పు॥ ఇది ముని, యజ్ఞమునకు పేరు.

హన్తు ర్మృత్యౌ మహాగదే,

హంతుః - ॥పు॥ ఇది మృత్యువు, పెద్దరోగమునకు పేరు.

ఆళిప్రకారయో స్సేతు

సేతుః - ॥పు॥ ఇది పంక్తికిని, రీతికిని పేరు.

ర్హేతుః కారణ కర్మణోః.

హేతుః-॥పు॥ ఇది కారణమునకు, కార్యమునకును నామము.

తాతో దయాయాం పితరి

తాతః - ॥పు॥ ఇది దయకు, తండ్రికిని నామము.

గ్రీష్మాదౌ స్త్రీరజస్యృతుః,

ఋతుః - ॥పు॥ ఇది షడృతువులకు, స్త్రీలరజస్సునకు పేరు.

గాతుః పుంస్కోకిలే భృంగే

గాతుః - ॥పు॥ ఇది మొగకోవెలకు, తుమ్మెదకును పేరు.

యన్తా హస్తిపసూతయోః.

యన్తా - ॥పు॥ ఇది మావటివానికిని, సారథికిని నామము.

క్షత్తా స్యా త్సారథౌ ద్వార్థ్స్నే వైశ్యాయా మపి శూద్రజే,
మూత మూతంచ ద్రవ్యే తృణై ర్వ్రీహ్యాదిబంధనే. ౧౪౪

క్షత్తా - ॥పు॥ ఇది సారథికి, ద్వారపాలకునకు, వైశ్యస్త్రీయందు శూద్రునివలన జనించినవానికిని, అపిశబ్దమువలన క్షత్రియస్త్రీయందు శూద్రునివలనం బుట్టినవానికిని నామము.

మూతమ్-ఇది బంగారు మొదలయినవాని కరిగించి ద్రవ్యాంతరముతోం జేర్చిపొడిచేయుట, వడ్లుమొదలైనవానికిం గట్టిం ముడికిని నామము.

దంతోఽద్రికటకే కుంజే రదనేఽప్యన్న తోపలే,
యానపాత్రశిశూ పోతౌ
హస్త స్స్యా ద్విస్తృతే కరే. ౧౪౫

దంతః - ॥పు॥ ఇది కొండనడిమిభాగము, పొద, దంతము పొడవగు ఱాతికిని పేరు.

పోతః-॥పు॥ఇది ఏరుదాంటునట్టియోడ,శిశువునకును నామము

హస్తః - ॥పు॥ ఇది విస్తారమునకు, హస్తమునకును పేరు.

సీతా సస్యే నభోనద్యాం జానక్యాం లాఙ్గలాధ్వని,
లతా కస్తూరికా శాఖా దూర్వా వల్లీ ప్రియఙ్గుషు.
పిపీలికాయాం మాధవ్యాం జ్యోతిష్మ త్యూర్ణ నాభ యోః,

సీతా - ॥స్త్రీ॥ ఇది పైరునకు, ఆకాశగంగకు, జానకికి, నాంగేటిచాలునకును నామము.

లతా - ॥స్త్రీ॥ ఇది కస్తూరి, కొమ్మ, దూర్వ, తీంగ, ప్రేంకణపుచెట్టు, చీమ, బండిగురుగింజ, మెఱుపుతీంగె, సాలెపురుగునకును నామము.

ఆర్తిః పీడా ధనుష్కోట్యో ర్మూర్తిః కాఠిన్య కాయ యోః. ౧౪౬

ఆర్తిః - ॥స్త్రీ॥ ఇది పీడ, వింటికొప్పునకును నామము.

మూర్తిః - ॥స్త్రీ॥ ఇది కఠినత్వము, శరీరమునకును పేరు.

కీర్తిః ప్రసాదే యశసి కర్దమే విస్తృతా వపి,
వర్తి ర్దీపదశా గాత్రలేప యో ర్మణిరంజనే. ౧౪౭
వ్రణభేదే భేషజే చ నయనాంజనలేఖయోః,

కీర్తిః - ॥స్త్రీ॥ ఇది అనుగ్రహము, కీర్తి, అడుసు, విస్తరించుటకును పేరు.

వర్తిః - ॥స్త్రీ॥ ఇది దీపపువత్తి, గంధద్రవ్యముంజేర్చి మెదిపినముద్ద, మణులచేతం జెక్కంబడుట, వ్రణము, ఔషధము, నేత్రము, కాటుకరేఖకును నామము.

శాన్తిః కల్యాణక్షమయోః
కాన్తి శ్శోభావరేణ్యయోః.
పఙ్క్తి శ్ఛన్దోఽపి దశమం
భ్రాన్తి ర్మిథ్యామతా వపి,

శాంతిః - ॥స్త్రీ॥ ఇది శుభము, ఓర్పునకు నామము.

కాంతిః - ॥స్త్రీ॥ ఇది కాంతి, శ్రేష్ఠమగుదానికిని పేరు.

పఙ్క్తిః - ॥పు॥ ఇది పదియక్షరములపాదముగల ఛందస్సు, అపిశబ్దమువలన బారుగానుండుటవలన, పదింటికి నామము.

భ్రాంతిః-॥స్త్రీ॥ ఇది భ్రాంతి, అపిశబ్దమువలనం దిరుగుటకు పేరు.

న్యాయ యోజనయో ర్యు
క్తి ర్భక్తి స్స్యా ద్భాగ
సేవయోః. ౧౫౦

శక్తిః కాసూ ప్రభుత్వాది
బలదుర్గాదిదేవతాః,

శుక్తిః కపాలశకలం దు
ర్నామా నయనామయః.
ముక్తాస్ఫోటో హయావర్త
శ్శఙ్ఖ శ్శఙ్ఖనఖో నఖః,

కృత్తి శ్చర్మణి భూర్జే చ
కర్తనే కృత్తికాసు చ.

గుప్తి స్స్యా ద్భూవ్యదా
సేఽపి కారావేశ్మనిరక్షణే,

ఆప్తి స్సమ్బన్ధ లాభ దా

ప్రాప్తి స్స్యా దుదయేఽ
పి చ. ౧౫౩

భిత్తిః కుడ్యే భేదనే స్యా
దవకాశప్రకాశయోః,

వర్తనం జీవనం టీకా కై
శిక్యాద్యాశ్చ వృత్తయః.
౧౫౪

విత్తి ర్విచార సద్భావ
జ్ఞాన లాభే ష్వ

థో రతిః, రతీ కామప్రి
యా ప్రీతౌ

స్తృతి స్తు గతిమార్గయోః.

జాతి శ్ఛన్దో జన్మగోత్రం
స్వవ్యాహతి కరోత్తరమ్,
సామాన్యం మాలతీ చాథ

సాతి ర్దానావసాదయోః.

యుక్తిః - ||సీ|| ఇది న్యాయము, కూర్చుటయును నామము.

భక్తిః - ||సీ|| ఇది భాగము, సేవచేయుటయును నామము.

శక్తిః-||సీ|| ఇది భల్లమనునాయుధము, ప్రభుమంత్రోత్సాహశక్తులు, బలము దుర్గము మొదలైనశక్తులకును నామము.

శుక్తిః-||సీ|| ఇది వెంక, ఏనుఁగుజెలగ, కంటిరోగము, ముత్తెపుచిప్ప, గుఱ్ఱపుసుడి, శంఖము, నత్తగుల్ల, గోటికిని పేరు.

కృత్తిః-||సీ|| ఇది చర్మము, భుజపత్రపుచెట్టు, ఛేదించుట, కృత్తికానక్షత్రమునకు నామము.

గుప్తిః - ||సీ|| ఇది నేలగుంట, చెఱసాల, రక్షించుటకు పేరు.

ఆప్తిః - ||సీ|| ఇది సంబంధము, లాభము మొదలయినవానికి నామము.

ప్రాప్తిః-||సీ|| ఇది ఉదయము, అపిశబ్దమువలన పొందుటకు నామము.

భిత్తిః-||సీ|| ఇది గోడ, ఛేదించుట, అవకాశము, ప్రకాశమునకు నామము.

వృత్తిః - ||సీ|| ఇది ఉంచుట, కృష్యాదిజీవనోపాయములు, సూత్రాదివివరణగ్రంథములు, అలంకారశాస్త్రప్రసిద్ధములగు కైశిక్యాదివృత్తులకును నామము.

విత్తిః - ||సీ|| ఇది విచారము, సత్స్వభావము, జ్ఞానము లాభమునకు నామము.

రతిః - రతీ ||సీ|| ఈరెండును, మన్మథునిభార్య, ప్రీతికిని నామము.

స్తృతిః - ||సీ|| ఇది నడుచుట, మార్గమునకు పేరు.

జాతిః-||సీ|| ఇది ఛందస్సు, పుట్టుట, వంశము, తనకువిరోధకరమైన మాటకును, గోత్వబ్రాహ్మణత్వాదులు, జాజితీఁగెకును నామము.

సాతిః - ||సీ|| ఇది దానము, ముగియుంటకును నామము.

శ్రుతి రామ్నాయ వార్త యోః, కర్ణే ప్యాకర్ణనే
చాథ ధర్మశాస్త్రేఽపి చ స్మృతిః. ౧౫౭

శ్రుతిః-॥స్త్రీ॥ ఇది వేదము, వార్త, చెవి, వినుటకు నామము.

స్మృతిః-॥స్త్రీ॥ ఇది మన్వాదిధర్మశాస్త్రము, అపిశబ్దమువలన స్మరించుట, జ్ఞాపకమునకు నామము.

ధృతి ర్యోగాన్తరే ధైర్యే ధారణే ప్రీతిసౌఖ్యయోః,

ధృతిః - ॥స్త్రీ॥ ఇది యోగభేదము, ధైర్యము, ధరించుట, సంతోషము, సౌఖ్యమునకును నామము.

గీతి ర్వృత్తాన్తరే గానే

గీతిః - ॥స్త్రీ॥ ఇది వృత్తభేదము, గానమునకు నామము.

నీతి స్స్యా త్ప్రాపణే నయే. ౧౫౮

నీతిః - ॥స్త్రీ॥ ఇది పొందించుట,నీతిశాస్త్రమునకును నామము.

ఈతి స్స్యా దతివృష్ట్యాది షట్కే-డింభప్రవాసయోః,

ఈతిః-॥స్త్రీ॥ ఇది అతివృష్టి మొదలయిన యీతిబాధల కాఱింటికి, బాలుఁడు, ప్రవాసమునకు నామము. ఈతిబాధలనఁగా- 'శ్లో. అతివృష్టి రనావృష్టిశ్శలభా మూషకా శ్శుకాః, అత్యాసన్నాశ్చ రాజాన షడేతా ఈతయస్స్మృతాః' అనునీశ్లోకమున జెప్పఁబడిన షడుపద్రవములు.

చితి శ్చితా స్తోమ ధీషు

చితిః - ॥స్త్రీ॥ ఇది చితి, సమూహమునకు, బుద్ధికిని నామము.

భృతి ర్భరణమూల్యయోః.

భృతిః - ॥స్త్రీ॥ ఇది కూలి, వెలకును నామము.

గతి స్తు గమనే మార్గే దశాయాం బుద్ధ్యుపాయయోః,

గతిః-॥స్త్రీ॥ ఇది నడుచుట, దారి, బాల్యము మొదలయిన యవస్థలు, బుద్ధి, ఉపాయమునకును పేరు.

భూతి ర్మాతఙ్గ శృఙ్గారే జన్మ సంపత్తి భస్మసు. ౧౬౦

భూతిః-॥స్త్రీ॥ ఇది ఏనుఁగునలంకరించుట, పుట్టుట, సంపద, భస్మమునకును నామము.

సేవనే సన్తతౌ ప్యాతి

ప్యాతిః - ॥స్త్రీ॥ ఇది సేవించుట, సంతతికిని నామము.

రూతి స్స్యాతౌ చరక్షణే,

ఊతిః-॥స్త్రీ॥ ఇది బట్టలు మొదలైనవానినిగుట్టుట, రక్షించుటకును నామము.

భీతిః కమ్పే భయే

భీతిః - ॥స్త్రీ॥ ఇది వడంకుట, భయమునకును నామము.

ప్రీతిః ప్రేమ్ణియోగాన్తరే ముది. ౧౬౧

ప్రీతిః-॥స్త్రీ॥ ఇది ప్రేమ, ప్రీతియనుయోగము, సంతోషమునకును నామము.

క్షితిః క్షయావాసభూషు

క్షితిః - ॥స్త్రీ॥ ఇది నాశము, ఉనికిపట్టునకును, భూమికిని నామము.

హేతి ర్జ్వాలా యుధాంశుషు,

హేతిః - ॥స్త్రీ॥ ఇది జ్వాల, ఆయుధము, కిరణమునకును నామము.

రీతి స్స్యన్దే లోహకిట్టే వైదర్భ్యా ద్యారకూట

రీతిః - ॥స్త్రీ॥ ఇది జారుట, ఇనుపచిట్టెము, వైదర్భి మొదలయినరీతులు, పిత్తళి, మర్యాద, వ్యవహారమునకును నామము.

యోః. ౧౬౨. మర్యాదా
యాం ప్రచారేఽ
థఖణ్డనే దైత్యమాతరి,దితిః
కృతి స్తు యత్నే చ వర్గా
ఖ్యగణితేఽపి నా ౧౬౩
మతి రిచ్ఛాధిషణయోః
స్థానమర్యాదయోస్థ్సితిః,
సతీ దక్షసుతాసాధ్వ్యో
స్త్రేతా త్వగ్నిత్రయే యు
గే. ౧౬౪
వృన్తంపయోధరాగ్రేఽపి
స్యా చ్ఛ ప్రసవబంధనే,
జ్యోతిస్తా రాగ్ని భా జ్వా
లా దృక్పుత్రా ధ్వరా
త్మసు. ౧౬౫
స్రోతో ఽంబునిర్గమద్వా
రే ప్రవాహేంద్రియయో
స్తే,
రేతస్తు సలిలే శుక్లే
స్వాంతం గహ్వర చిత్త
యోః. ౧౬౬
స్త్రియాం వీతి ర్గతా వ
గ్నేః ప్రభాయాం ఘోట
కేతు నా,
పత్తిః పదాతౌ నాస్త్రీ
ం గతి సేనావిశేషయోః.
యతి ర్భిక్షౌ పుమాన్ స్త్రీ
ం నియమే, శ్లోకవిశ్రమే,
న్తోఽస్త్రీనిశ్చయేనాశేస్వ
పేఽగ్రేఽన్తికేఽన్తరే.
వాస్తు రస్త్రీ గృహం సీమా
రంగా గృహభూః పురీ,

దితిః ॥స్త్రీ॥ ఇది ఖండించుట, దితిదేవికిని నామము.

కృతిః-॥స్త్రీ॥ ఇది యత్నము, వర్గయను పేరుగలగణితము, అపిశబ్దమువలన ప్రబంధమునకును నామము.

మతిః-॥స్త్రీ॥ ఇది ఇచ్ఛ, బుద్ధికిని నామము.

స్థితిః-॥స్త్రీ॥ ఇది ఉనికి, మర్యాదకును నామము.

సతీ - ॥స్త్రీ॥ ఇది దాక్షాయణి, పతివ్రతకును పేరు.

త్రేతా-॥స్త్రీ॥ ఇది గార్హపత్యాహవనీయ దక్షిణాగ్నులు, త్రేతాయుగమునకును నామము.

వృంతమ్-॥న॥ఇది స్త్రీలయొక్క చనుగొనలు, పూవులయొక్క తొడిమె, చకారమువలన వాకుడుచెట్టునకును నామము

జ్యోతిః-॥న్॥ ॥న॥ ఇది నక్షత్రము, అగ్ని, కాంతి, జ్వాల, నేత్రము, పుత్రుడును, ధనము, యాగము, ఆత్మకును నామము.

స్రోతః (న్) ॥న॥ ఇది జలదారి, ప్రవాహము, ఇంద్రియములు, ఉదకమునకును నామము.

రేతః-(న్) ॥న॥ ఇది ఉదకము, రేతస్సునకును నామము.

స్వాంతం ॥న॥ ఇది గుహ, చిత్తమునకును నామము.

వీతిః-॥స్త్రీ॥ ఇది నడుపు, అగ్ని, తేజస్సునకును నామమయ్యేనేని ॥స్త్రీ॥ గుఱ్ఱమునకు నామమయ్యేనేని ॥పు॥

పత్తిః-ఇది కాలిబంటునకు నామమయ్యేనేని ॥పు॥ నడక, సేనాభేదమునకును, నామమయ్యేనేని ॥స్త్రీ॥

యతిః-ఇది సన్న్యాసికి నామమయ్యేనేని ॥పు॥ నియమము, శ్లోకముయొక్క విశ్రమస్థానమునకును నామమయ్యేనేని ॥స్త్రీ॥

అంతః-॥న్న॥ ఇది నిశ్చయము, నాశము, స్వరూపము, ముందుభాగము, సమీపము, మధ్యమునకును నామము.

వాస్తుః-॥న్న॥ ఇది గృహము, ఎల్లకును, సురంగము, గృహభూమికిని, పట్టణమునకు నామము.

అనుక్తలింగే ష్వేతేషు
వాచ్యలింగత్వ మామృతా
త్. ౧౬౯

బ్రాహ్మ్యాదికా అకారా
ద్యాః ప్రసూ ర్గౌరీ చ మా
తరః, స్త్రియాం మాతా
మాపకే నా

ధాతా ధర్తరి నా విధౌ.
శాస్తా చ శాసనే నాతు బుద్ధే
వప్తా తు వాపకే, పుమా న
యం స్యా త్పితరి

శీతా వలసశీతలౌ. ౧౭౧
శీతం క్లీబే శైత్యగుణే
శీలు వేతసయోః పుమాన్,
వృత్తిషు స్నీరుజో ర్వా
ర్తం త్రిషు చారోగ్యఫల్గు
నోః. ౧౭౨. స్త్రియాం ము
దన్తే వార్తాకే కృష్యాదౌ
వర్తనేఽపి చ,

శ్వేతో వళక్షే క్లీబే తు
రూప్యే నాద్వీపవర్ణయోః.
కృతీ కృతార్థవిదుషో
శ్శితి ర్ధవళసేలయోః,
స్వామిపోషకయో ర్భర్తా
వక్తా పణ్డితవాగ్మినోః.
౧౭౪

పూతం పవిత్రే వస్త్రాది
శోధితే బహుళీకృతే,
యుంతో యుక్తపృథగ్భూ
తౌ
మతౌ సమ్మతపూజితౌ.
౧౭౫

ఇది మొదలు-ఆమృతాత్=ముందు చెప్పఁ
వఱకు అనుక్తలింగేషు=లింగమును దెలియఁజెప్ప
శబ్దములయందు, వాచ్యలింగత్వం=విశేషలింగత

మాతా-ఇది బ్రాహ్మి, మహేశ్వరి, కౌమారి,
రాహి, ఇంద్రాణి, చాముండి యనుసియేడ్గురిక
షోడశాక్షరములకును, కన్నతల్లికిని, గౌరికిని స
॥సీ॥ కొలతగానికి నామమయ్యెనేని ॥పు॥

ధాతా-॥పు॥ ఇది ధరించువానికిని, బ్రహ్మకు
శాస్తా-॥పు॥ ఇది శిక్షునికిని, బుద్ధదేవునకును
వప్తా-॥పు॥ ఇది విత్తెడువానికిని, తండ్రికినినా

శీతః-॥పు॥ ఇది మందునికిని, చల్లనైనదానికిని
శీతమ్-ఇది చల్లదనమునకు పేరగునపుడు ॥
కును, ప్రబ్బలిచెట్టునకును నామమయ్యెనేని ॥పు॥
వార్తమ్-ఇది జీవనముగలవానికిని, రోగహీ
మయ్యెనేని ॥న॥ ఆరోగ్యమునకును, తుచ్ఛమునక
య్యెనేని ॥త్రి॥ లోకవార్తకును మునగచెట్టున
జీవనోపాయములకును, జీవనమునకు నామమయ్యె

శ్వేతః-ఇది తెలుపునకు నామమయ్యెనేని॥పు
మయ్యెనేని ॥న॥ ద్వీపము, కాంతికిని నామమ
కృతీ-॥పు॥ ఇది కృతకృత్యునకును, విద్వాంసు
శితిః-॥త్రి॥ ఇది తెల్లనిదానికిని, నల్లనిదానికిని
భర్తా-॥పు॥ ఇది ప్రభువునకును, పోషకునికిని
వక్తా-॥పు॥ ఇది పండితునకును, తానుబలుక
యర్థమును జక్కఁగా నిర్వహించిపలుకువానికిని
పూతమ్-॥త్రి॥ పరిశుద్ధమైనదానికిని, వస్త్రాదు
గట్టఁబడినదానికిని, విస్తారము చేయఁబడినదానికిని
యుంతః-॥పు॥ ఇది కూడినదానికిని, వేరైనదా
మతః-॥పు॥ ఇది ఇష్టమైనదానికిని, పూజిం
పేరు.

మితౌ జ్ఞాతపరిచ్ఛిన్నౌ

మితః - ॥పు॥ ఇది తెలియఁబడినదానికిని, కొలువఁబడిన దానికిని నామము.

ఏతౌ వాగతకర్బురౌ,

ఏతః - ॥పు॥ ఇది వచ్చుటకును, చిత్రవర్ణమునకును పేరు.

యతౌ తు బద్ధనియతౌ

యతః - ॥పు॥ ఇది కట్టఁబడినదానికిని, నియమముతోఁ గూడినదానికిని నామము.

వక్రబంధురయోర్నతం.

నతమ్-॥న॥ ఇది వక్రమైనదానికిని, వంగినదానికిని నామము.

గతిహీన ప్రతిజ్ఞాత నిశ్చితోర్ధ్వజ్ఞు సు స్థితం,

స్థితమ్-॥న॥ ఇది గమనహీనమైనదానికిని, ప్రతిజ్ఞచేయఁబడినదానికిని, నిశ్చయింపఁబడినదానికిని, పొడుగు మోఁకాళ్లు గలదానికిని పేరు.

అవాప్త న్యాయ్యయోః ప్రాప్త

ప్రాప్తమ్-॥న॥ ఇది పొందఁబడినదానికిని, న్యాయముగల దానికిని నామము.

మాప్తస్స్యాత్సభ్యలబ్ధయోః. ౧౭౭

ఆప్తః - ॥పు॥ ఇది సభాయోగ్యునకును, పొందఁబడినదానికిని నామము.

గూఢరక్షితయోర్గుప్తం

గుప్తమ్-॥న॥ ఇది రహస్యమైనదానికిని, రక్షింపఁబడినదానికిని నామము.

లిప్తం భక్షితదిగ్ధయోః,

లిప్తమ్-॥న॥ ఇది భక్షింపఁబడినదానికిని, పూయఁబడినదానికిని నామము.

స్థాపితే ప్రేరితే క్షిప్తం

క్షిప్తమ్ - ॥న॥ ఇది ఉంపఁబడినదానికిని, ప్రేరేపింపఁబడిన దానికిని నామము.

హితం ప్రహితపథ్యయోః.

హితమ్-॥న॥ ఇది పంపించుటకును, పథ్యమునకును పేరు.

శుక్తౌ పూత్యమ్లపరుషౌ

శుక్తః-॥పు॥ ఇది దుర్వాసనగలపులుసునకును, కఠినమయిన దానికిని పేరు. దుర్వాసనగల పులుసనగాఁ గుండయందు తేనె, బెల్లము, కలి ఈ 3 నుం గలిపి ధాన్యరాశియందు 3 రాత్రిళ్లు పెట్టినపులుసునకు నామము.

మృతం స్యాద్యాచితేఽపి చ,

మృతమ్ - ॥న॥ ఇది యాచింపఁబడినభైక్షమునకును, అపి శబ్దమువలన మృతిబొందెననుటకును నామము.

న్యాయ్యేఽపి యుక్తం

యుక్తమ్ - ॥న॥ ఇది న్యాయము నతిక్రమింపనిదానికిని, అపిశబ్దమువలన కూడినదానికిని నామము.

గ్రస్తస్తు లుప్తవర్ణపదేఽపి చ. ౧౭౮

గ్రస్తమ్ - ॥న॥ ఇది అక్షరలోపమైనపదము, అపిశబ్దము వలన గ్రహింపఁబడినదానికిని పేరు.

ఇతం గతం చ జ్ఞానేఽపి

ఇతమ్-గతమ్॥న॥ ఈ ౨-ను జ్ఞానము, అపిశబ్దమువలన బొందు [టకును పేరు.

ధుతం ధూతఞ్చ కమ్పితే, త్యక్తే

ధుతమ్-ధూతమ్॥న॥ ఈ ౨-ను కదిలింపఁబడినదానికిని, విడువఁబడినదానికిని పేరు.

పృథ శ్రుతం క్లీబే శాస్త్రావధృతయో రపి. ౧౮౦

శ్రుతమ్-॥న॥ ఇది శాస్త్రము, వినఁబడినదానికిని పేరు.

క్లీబే శాతం శితం చాపి సుఖే చ నిశితే కృశే,

శాతమ్-శితమ్ ॥న॥ ఈ ౨ను సుఖము, తీక్ష్ణము, కృశించిన దానికిని పేరు.

శ్వేతే బద్ధే సితం శర్కరాయాం స్త్రీ నా గుణే కవౌ. ౧౮౧

సితమ్-ఇది తెలుపు, బంధమునకును నామమయ్యెనేని ॥న॥ చక్కెరకు పేరైనపుడు ॥స్త్రీ॥ తెలుపు, శుక్రునకును నామమయ్యె నేని ॥పు॥

తతం వ్యాప్తే విస్తృతే చ వీణాదౌ తు నపుంసకమ్,

తతమ్-॥న॥ ఇది వ్యాపింపఁబడినది, విస్తరింపఁబడినది, వీణె మొదలగు వాద్యములకును పేరు.

క్లీబే కృతం యుగేఽపి స్యాత్ఫలపర్యాప్తయో రపి.

కృతమ్ - ॥న॥ ఇది కృతయుగము, ఫలము, నివారించుట కును పేరు.

ద్రుతం విలీనావదీర్ణ వేగే ష్వేష తు న ద్వయోః, శీఘ్రే శీఘ్రగతౌ చా

ద్రుతమ్ - ॥న॥ ఇది కరుగుట, కరిగినఘృతాదుల వేగము, శీఘ్రగమనమునకును పేరు.

ఋతం ప్రాపితే తు భవే దృతమ్. శిలోఞ్ఛ సత్య సలిలసు శీలేషు తు న ద్వయోః,

ఋతమ్ - ॥న॥ ఇది పొందింపఁబడినది, మళ్లలోని ధాన్యము నేరి బ్రదుకుట, ఉంఛవృత్తి, సత్యము, ఉదకము, సత్స్వభావ మునకును పేరు.

ప్లుతం త్రిమాత్రకేఽప్యశ్వగతౌ తు స్యాన్నపుంసకమ్.

ప్లుతమ్-॥న॥ ఇది త్రిమాత్రా కాలము, గుఱ్ఱము పేరెమువదిలి కాళ్లను మీఁదికిఁ గదిలించుటకును పేరు.

మృతే నారకసత్త్వే చ ప్రేతో భూతాన్తరే తు నా,

ప్రేతమ్ - ॥పు॥ ఇది చచ్చినవానికిని, నరకమునందుండు జంతువు, పిశాచమునకును పేరు.

భూతం న్యాయ్యే సమే ప్రాప్తే యథార్థాతీతయో రపి. ౧౮౨. క్లీబే త్వయం పిశాచాదౌ భూమ్యాదౌ జంతు సత్త్వయోః,

భూతమ్ - ఇది యోగ్యమయినదానికిని పేరయినపుడు ॥న॥ సమానమయినదానికి, పొందఁబడినదానికి, యథార్థము, గడిచిన దానికిని నామమయ్యెనేని ॥త్రి॥ పిశాచాదులు, పృథివ్యాది పంచభూతము, జంతుమాత్రము, సత్యమునకును పేరగునపుడు ॥న॥

ఉత్పన్న భూతయో ర్జాతం బృందజాత్యో స్తు నద్వయోః. ౧౮౩

జాతమ్-ఇది పుట్టినదానికి నామమయ్యెనేని ॥త్రి॥ అయినది యనుట, గుంపు, జాతికిని పేరగునపుడు ॥న॥

పీతం పీతే హరిద్రాభే గౌరవర్ణే తు పుం స్వయమ్, పీతా హరిద్రా

పీతమ్-ఇది ఆకుపచ్చ, పసుపువన్నెకును పేరగునపుడు ॥న॥ తెల్లని కాంతికిని పేరగునపుడు ॥పు॥ పసుపునకును నామమయ్యె నేని ॥స్త్రీ॥

పాతస్తు రక్షితే పతనే చ నా. ౧౮౭

పాతః-॥పు॥ ఇది రక్షింపఁబడినదానికిని, పడుటకును పేరు.

పీతం శాన్తే దుర్బలాశ్వే గతే చ బలవర్జితే,

పీతం-॥న॥ ఇది శాంతమునకును, బలములేనిగుఱ్ఱమునకును, అట్టియేనుఁగునకును పేరు.

సుత స్త్వభిషుతే పుత్త్ర్యాం సుతా నా త్వాత్మజే నృపే. ౧౮౮

సుతః-ఇది యజ్ఞమునందు సోమలతలంబిండినవానికి పేరయినపుడు ॥పు॥ కొమార్తెకును పేరగునపుడు ॥స్త్రీ॥ పుత్త్రునకు, రాజునకు పేరయినపుడు ॥పు॥

పిత్రోః ప్రసూతే సూత స్స్యాత్స తు వా తక్ష్ణిసారథౌ, క్షత్త్రా ద్ద్విజాసుతే వ్యాసశిష్యే పారదవన్దినోః.

సూతః-॥పు॥ ఇది తల్లిదండ్రులకును, కనుటకును, వడ్లవానికిని, సారథికిని, రాజువలన బ్రాహ్మణస్త్రీకిఁ బుట్టినవానికిని, వ్యాసశిష్యునికిని, రసమునకును, భట్టువానికిని పేరు.

సుప్తే ఽస్తం పశ్చిమాద్రౌ తు పుంసి

అస్త-ఇది నిదురఁబోయినవానికి నామమయ్యోనేని ॥న॥ పశ్చిమాద్రికి నామమయ్యోనేని ॥పు॥

శస్తంతు విశ్రుతే, క్లీబం క్షేమే

శస్తం-॥న॥ ప్రసిద్ధమునకును, క్షేమమునకును పేరు.

ఽథ భక్తం స్యాత్సత్వరే ఽన్నే తు న ద్వయోః.

భక్తం-॥న॥ ఇది త్వరకును, అన్నమునకును పేరు.

వృత్తం స్యా ద్వర్తులాతీతదృఢేషు త్రిషు న ద్వయోః, స్వరూపే చరితే పద్యే జననే వర్తనేఽపి చ.

వృత్త-ఇది వట్రువయినదానికి, గడచినదానికి, బటువయినదానికిని నామమయ్యోనేని ॥త్రి॥ స్వరూపము, చరిత్రము, పద్యము, వేగము, జీవనోపాయములకును నామమయ్యోనేని ॥న॥

ఉక్తం ప్రోక్తే న ద్వయోస్తు ఛన్దోభేదేఽపి భాషణే,

ఉక్తం-॥న॥ ఇది చెప్పఁబడినదానికిని, మొదటిఛందస్సునకును, మాటకును పేరు.

వ్యక్తం స్పష్టే నా తు బుధే

వ్యక్త - ఇది స్పష్టమయినదానికి నామమయ్యోనేని ॥న॥ పండితునకు నామమయ్యోనేని ॥పు॥

తిక్తస్తు రసభేదవాక్. తిక్తా స్త్రీకటురోహిణ్యాం సుగన్ధరసయోస్తు నా,

తిక్త-ఇది చేఁదుగలదానికి నామమయ్యోనేని ॥పు॥ కటుకరోహిణికి నామమయ్యోనేని ॥స్త్రీ॥ సుగంధమునకును, రుచికిని నామమయ్యోనేని ॥పు॥

రక్తోఽనురక్తే నీల్యాది రంజితేలోహితేఽపిచ. వర్ణే చ నా కుంకుమాసృక్తామ్రేషు త్వేష న ద్వయోః,

రక్త-ఇది ప్రేమగలవానికి, నీలిమొదలయిన చాయవేయఁబడినదానికి, ఎఱుపుగలదానికి, ఎఱుపునకును నామమయ్యోనేని ॥పు॥ కుంకుమ, నెత్తురు, రాగికిని నామమయ్యోనేని ॥న॥

పరిత్యక్తేఽపి ముక్తస్స్యా త్స్మృతో ముక్తాఫలే స్త్రియామ్. ౧౯౪

ముక్తః-ఇది విడువఁబడినదానికిని, అపిశబ్దమువలన ముక్తునకును నామమయ్యోనేని ॥పు॥ ముక్తి, ముత్యమునకును నామమయ్యోనేని ॥స్త్రీ॥

కాంతం చారౌ స్త్రీతు యోషి త్ప్రియంగౌ పుప లేఽపి నా,
క్లీబే రతం గుహ్యరత్యోః
క్లీబ మాజ్యామ్బునో ర్ఘృతమ్. ౧౯౫

కాంతమ్-ఇది అందమయినదానికి నామమయ్యోనేని ॥న॥ స్త్రీకి నామమయ్యోనేని ॥స్త్రీ॥ ప్రేంకణపుచెట్టు, సూదంటుఱాయి, అపిశబ్దమువలన ప్రియమునకును నామమయ్యోనేని ॥పు॥

రతమ్-॥న॥ ఇది రహస్యమును, రతికిని పేరు.

ఘృతమ్-॥న॥ ఇది నేతికిని, నీళ్లకును పేరు.

పూతాదీనాం త్రిలిఙ్గత్వం నిష్ఠా చే త్కర్తృకర్మణోః, భావే చే త్క్లీబమేవాత్ర సర్వతన్త్రే ష్వయం విధిః. ౧౯౬

అత్ర=ఈగ్రంథమున, పూతాదీనాం=పూతశబ్దము మొదలైనవానికి, కర్తృకర్మణోః = కర్త్రర్థక కర్మార్థకములయందు, నిష్ఠాచేత్=క్తప్రత్యయమువచ్చెనేని, త్రిలింగత్వం=ముల్లింగములుంగలుగుట, భవేత్=అగును. భావేచేత్ = భావార్థమునఁ క్తప్రత్యయమువచ్చెనేని, క్లీబమేవ=నపుంసకమే, సర్వతంత్రేషు = సకలసిద్ధాంతములయందును, అయమ్=ఇది, విధిః=విధానము.

ఇతి తాన్తాః.

తాంతపదవర్గము ముగిసెను.

---

అర్థః ప్రకారే విషయే వ్యవహారే ప్రయోజనే, అభిధేయే ధనే శాస్త్రే వస్తు హేతు నివృత్తిషు. ౧౯౭

అర్థః-॥పు॥ ఇది భేదమునకును,మృత్పాషాణాదులకును, వ్యవహారమునకును, ప్రయోజనమునకును, వాచ్యార్థమునకును, ధనమునకును, శాస్త్రమునకును, వస్తువునకును, హేతువునకును, నివర్తించుటకును పేరు.

గజపృష్ఠా స్తీర్ణ చిత్రద్రవ్యే వేణ్వాం కుశే కుథః,
రథో దేహేఽపి

కుథః-॥పు॥ ఇది ఏనుఁగుమీఁపునఁబరుచు రత్నకంబళికిని, వెదురుకును, దర్భకును పేరు.

రథః-॥పు॥ ఇది దేహమునకును, అపిశబ్దమువలన మనోరథమునకును, రథమునకును, వాహనమునకును పేరు.

సార్థస్తు వణిక్సఙ్ఘేచ సంహతౌ. ౧౯౮

సార్థః-॥పు॥ ఇది వర్తకులసమూహమునకును, గుంపునకును పేరు.

మన్థో సాక్తవమన్థానౌ
గ్రన్థిః పర్వగదాన్తరే,
గ్రన్థో ధనే వాక్సన్దర్భే
ద్వాత్రింశద్వర్ణసంహతౌ.

మంథః-॥పు॥ ఇది పిండికిని, పక్వమునకును పేరు.

గ్రంథిః-॥పు॥ ఇది గణుపునకును, రోగభేదమునకును పేరు.

గ్రంథః-॥పు॥ ఇది ధనమునకును, శబ్దములఁగూర్చిన ప్రబంధమునకును, ౩౨. అక్షరముల సముదాయమునకును పేరు.

ఆస్థా ప్రతిజ్ఞా తాత్పర్య గోష్ఠీయత్నోపలమ్భనే,

ఆస్థా—॥స్త్రీ॥ ఇది ప్రతిజ్ఞకును, తాత్పర్యమునకును, కొలువు కూటమునకును, యత్నమునకును, అనుభవించుటకును పేరు.

సంస్థా స్థితౌ వ్యవస్థాయాం సమాప్త్యాకార మృత్యుషు. ౨౦౦

సంస్థా—॥స్త్రీ॥ ఇది స్థితికిని, మర్యాదకును, సమాప్తికిని, స్వరూపమునకును, మృతికిని పేరు.

వీథీ వర్త్మని పంక్త్యాంచ గృహాంగే రూపకాన్తరే,

వీథీ—॥స్త్రీ॥ ఇది మార్గమునకును, పంక్తికిని, గృహావయవమునకును, నాటకభేదమునకును పేరు.

నవనీతం జలం పాథ మన్నంతోయంచ పాథసీ.

పాథం — ॥న॥ ఇది వెన్నకును, ఉదకమునకును పేరు.

పాథః—॥స్॥ ॥న॥ ఇది అన్నమునకును, ఉదకమునకును పేరు.

జలావతారో గురు యోన్యుపాయ శాస్త్రాది యజ్ఞో మునిజుష్టతోయమ్, మన్త్రాద యోఽష్టాదశ పుణ్యభూమిః పాత్రం జలం స్త్రీకుసుమం చ తీర్థమ్. ౨౦౨

తీర్థమ్—॥న॥ ఇది రేవునకును, గురువునకును, యోనికిని, ఉపాయమునకును, శాస్త్రమునకును, యజ్ఞమునకును, మహర్షులుస్నానము చేయుం జలాశయమునకును, రాజుయొక్క యాలోచనస్థలము మొదలగు ౧౮ స్థలములకును, పుణ్యస్థలమునకును, పాత్రమునకును, ఉదకమునకును, స్త్రీలముట్టునకును పేరు.

పృథుర్నృపే స్త్రీతు కృష్ణజీరకే మహతి త్రిషు,

పృథుః — ఇది ఒకరాజునకు పేరగునపుడు ॥పు॥ నల్లజీలకఱ్ఱకు పేరగునపుడు ॥స్త్రీ॥ విస్తారముయినదానికి పేరయినపుడు ॥త్రి॥

కటే స్త్రీ గర్భయో రశ్వఘోణాయాం ప్రోథమస్త్రియామ్. ౨౦౩

ప్రోథమ్—॥ప్న॥ ఇది పిఱుఁదునకును, స్త్రీకిని, గర్భమునకును, గుఱ్ఱముయొక్క ముక్కునకును పేరు.

సిక్థో భక్తపులాకే నా మధూచ్ఛిష్టేతు న స్త్రియామ్,

సిక్థః—ఇది మెతుకునకు పేరగునపుడు ॥పు॥ మైనమునకు పేరగునపుడు ॥ప్న॥

నీలీ సూక్ష్మైలయో స్తుత్థా తుత్థ స్స్యాద్దఞ్జనే పుమాన్. ౨౦౪

తుత్థా—ఇది నీలిచెట్టునకును, స్వల్పభూమికిని పేరగునపుడు ॥స్త్రీ॥ రసాంజనమునకు పేరైనపుడు ॥పు॥

నాథస్త్రిషు ప్రభౌ నేన్ద్రే ప్రస్థోఽస్త్రీ సానుమానయోః,

నాథః—ఇది ప్రభువునకుఁ బేరగునపుడు ॥త్రి॥ ఇంద్రునక [పేరగునపుడు ॥పు

ప్రస్థః—॥ప్న॥ ఇది కొండచరికిని, కుంచమునకును పేరు.

యాచకే ధనికే త...

...(స్)—॥పు॥ ఇది యాచకునకును, ధనికునకును పేరు.

దుస్థో త్రిష్వజ్ఞ...

దుస్థః—॥త్రి॥ ఇది మూఢునకును, కష్టమును జెందిన వానికిని పేరు.

ఇతి థా...

థాంతపదవర్గము ముగిసెను.



శబ్దోఽక్షర యశో గీత
వ్యోమవాక్యధ్వనిష్వపి,
అబ్ద స్సంవత్సరే మేఘే
క్షోదో రజసి పేషణే. ౨౦౬
వశాభిప్రాయయో శ్ఛన్ద
స్స్యా త్పర్ణే గరుతి ఛ్ఛదః,
గజదానం గర్వహర్ష రేతో
మృగమదా మదాః. ౨౦౭
వేద శ్ఛన్దసి యజ్ఞాంగే
రదో దన్తే విలేఖనే,
భేద స్స్యా దుపజాపేచ
విదారణ విశేషయోః. ౨౦౮
శాదః పఙ్కే బాలతృణే
స్వేద స్స్వేదనఘర్మయోః,
పాదో బుధ్నే తురీయాంశే
శైలప్రత్యన్తపర్వతే.
౨౦౯. చరణే కిరణే చాథ
క్లేదో రసళశాఙ్కయోః,
కన్దో వృక్షాదిమూలేచసూ
రణామ్బుదయోరపి. ౨౧౦
స్కన్దో గుహే నదీ
కూలే
సా ద్యశ్వారోహ సూ
తయోః,
పాదుకోపానహోః పా
దూ
ఛర్ది ర్వమన రేతసోః
పాదభూషాశృఙ్ఖలయో ర
దు స్త్రయ
స్త్వమీ స్త్రియః,
పదవ్యాజాంఘ్రి తచ్ఛి

శబ్దః-॥పు॥ ఇది అక్షరమునకును, కీర్తికిని, గానమునకును, ఆకాశమునకును, వాక్యమునకును, ధ్వనికిని పేరు.

అబ్దః-॥పు॥ ఇది సంవత్సరమునకును, మేఘమునకును పేరు.

క్షోదః-॥పు॥ ఇది ధూళికిని, నూఱుటకును పేరు.

ఛందః-॥పు॥ ఇది అధీనునికిని, అభిప్రాయమునకును పేరు.

ఛదః-॥పు॥ ఇది ఆకునకును, ఱెక్కకును పేరు.

మదః-॥పు॥ ఇది ఏనుఁగు మదమునకును, గర్వమునకును, సంతోషమునకును, రేతస్సునకును, కస్తూరికిని పేరు.

వేదః-॥పు॥ ఇది వేదమునకును, అత్తిచెట్టునకును పేరు.

రదః-॥పు॥ ఇది దంతమునకును, గీరుటకును పేరు.

భేదః-॥పు॥ ఇది భేదోపాయమునకును, పగల్చుటకును, విశేషజ్ఞానమునకును పేరు.

శాదః-॥పు॥ ఇది అడుసునకును, లేఁతకసవునకును పేరు.

స్వేదః-॥పు॥ ఇది చెమటపట్టుటకును, చెమటకును పేరు.

పాదః-॥పు॥ ఇది చెట్టుమొదటికిని, నాలవభాగమునకును, కొండసమీపమునను్న తిప్పకును, పాదమునకును, కిరణమునకును పేరు.

క్లేదః-॥పు॥ ఇది రుచికిని, చంద్రునకును పేరు.

కన్దః-॥పు॥ ఇది వృక్షాదులయొక్క వేరునకును, కలువగడ్డకును, మేఘమునకును పేరు.

స్కందః-॥పు॥ ఇది కుమారస్వామికిని, నదియొక్క గట్టునకును పేరు.

సాదీ (న్)-॥పు॥ ఇది గుఱ్ఱపురౌతునకును, సారథికిని బేరు.

పాదూ-॥స్త్రీ॥ ఇది చెప్పునకును, పావుకోళ్లకును పేరు.

ఛర్దిః-॥స్త్రీ॥ ఇది కక్కుటకును, రేతస్సునకును పేరు.

అదుః-॥స్త్రీ॥ ఇది అందెమొదలయిన పాదాభరణములకును, ఏనుఁగులంగట్టుగొలుసునకును పేరు.

అమీ-ఈ పాదూ, ఛర్ది, అదు, అనుశబ్దములు 3 ను, స్త్రియః= స్త్రీలింగములుగలవి.

పదమ్॥న॥ ఇది స్వార్థమయి యొకదానినుద్దేశించి మఱియొక

హ్న స్థాన త్రాణాంశు ల
క్ష్మసు. ౨౧౨. వ్యవసాయే
సుస్తిఙోఘే సాయకే వస్తు
వాక్యయోః,

దానిఁజేయుంటకును, పాదమునకును, అడుగుజాడకును, స్థానమునకును, రక్షించుటకును, కిరణమునకును, అడియాళమునకును, ఉద్యోగమునకును, సుబంతతిఙంతసమూహమునకును, బాణమునకును, వస్తువునకును, వాక్యమునకును పేరు.

ఛందాంసి త్రిష్టుబాదీని
శ్రుతీచ్ఛానునయా అపి.

ఛందః (స్) - ॥న॥ ఇది త్రిష్టుప్ మొదలగుఛందస్సులకును, వేదమునకును, ఇచ్ఛకును, ఊరడించుటకును పేరు.

నద స్సముద్రే నినదే సరి
ద్భేదే

నదః-॥పు॥ ఇది సముద్రమునకును, ధ్వనికిని, పడమరగాఁ బారునదికిని పేరు.

నదీ సరిత్,

నదీ-॥స్త్రీ॥ ఇది నదికిఁ బేరు.

గదో రోగహరిభ్రాత్రో
ర్గదా స్యా దాయుధాం
తరే. ౨౧౩

గదః-ఇది రోగమునకును, శ్రీకృష్ణునితమ్మునికిని పేరైనపుడు ॥పు॥ ఆయుధవిశేషమునకుఁ బేరగునపుడు ॥స్త్రీ॥

కున్దం మాఘ్యేచ కుందో
నా నిధిభేదమురద్విషోః,

కుందమ్-ఇది మొల్లపూవునకుఁ బేరగునపుడు ॥న॥ నిధికిని విష్ణువునకును బేరగునపుడు ॥పు॥

మన్దః పుంసి రవే స్సూనౌ
గజభేదే త్వయం త్రిషు. ఖ
లమూర్ఖ జడస్వైరస్వల్ప ని
ర్భాగ్యరోగిషు,

మందః-ఇది శనైశ్చరునకుఁ బేరైనపుడు ॥పు॥ మందజాతియేనుఁగునకును, కొండెగానికిని, మూర్ఖునకును, వివేకహీనునకును, స్వేచ్ఛకును, కొంచెమునకును, నిర్భాగ్యునకును, రోగికిని పేరయినపుడు ॥త్రి॥

మృ ద్వనుష్ణేఽపి

మృదు-॥త్రి॥ ఇది వేఁడిలేనిదానికిని, అపిశబ్దమువలన మెత్తనిదానికిని పేరు.

మధురం మృష్ట స్స్వా
త్స్వా

స్వాదు - ॥త్రి॥ ఇది మధురమయినదానికిని, రుచిగలదానికిని పేరు.

ద్వి మా త్రిషు. ౨౧౪

ఈమృదుస్వాదుశబ్దములురెండును త్రిలింగములు గలవి.

ఇతి దాంతాః.

దాంతపదవర్గము ముగిసెను.

---

బుధ స్సూరౌ సురే సౌమ్యే

బుధః-॥పు॥ఇది పండితునకును, దేవతకును, బుధునకును పేరు.

వేధా విష్ణౌ విధాతరి,

వేధాః(స్)-॥పు॥ ఇది విష్ణువునకును, బ్రహ్మకును పేరు.

విధు స్సుధాకరే కాలే
విష్ణౌ వాతేఽగ్ని రక్షసోః.

విధుః-॥పు॥ ఇది చంద్రునకును, కాలమునకును, విష్ణువునకును, వాయువునకును, అగ్నికిని, రాక్షసునికిని పేరు.

విధి ర్విధానే నియతౌ
కాలే పద్మభవే

విధిః॥పు॥ ఇది చేయుంటకును, దైవమునకును, కాలమునకును, బ్రహ్మకును, అపిశబ్దమువలన ప్రకాశమునకును, విధాయక వాక్యమునకును పేరు.

వ్యథ, అధిష్ఠానే చిత్త
దుఃఖే వ్యసనే బంధనేఽపి
చ. ౨౧౮. ఆధి
ర్బోధి స్సమాధౌచ కు
కుటాశ్వత్థబుద్ధిషు,
అబ్ధి స్సరస్సరస్వంతౌ
బంధూబంధూకబాంధవౌ.
గంధో గంధక సంబంధా
మోద లేశ స్మయేషుచ,
స్కంధో దేహావిభాగే
ఽంసే ప్రకాండే సంహతౌ
నృపే. ౨౨౦

విధా విధానే హస్త్య
న్నే ప్రకారే వేతనేఽపిచ,
సుధామృతం లేపభేదో
మూర్వా సర్పాశనం స్ను
హీ. వధూ ర్నవోఢాస్ను
షయో ర్భార్యా స్త్రీ శారి
బాసుచ,
గోధా తలే నిహాకాయా

వృద్ధి ర్మోదసుఖర్ధిషు.
సంధాఽవధౌ ప్రతిజ్ఞాయాం
శ్రద్ధా త్వాస్తిక్య కాం
క్షయోః,
ఆలస్యనిద్రయో ర్మిద్ధం
ఖండేఽర్ధోఽర్ధం సమాంశ
కే. ౨౨౩
చైత్రవసంత మధుద్రుహా
దైత్యవిశేషు పుంసి మ
ధుశబ్దః, క్లీబే త్వంబునిదుగ్ధ

ఆధిః-॥పు॥ఇది ఒకదానికినాధారమైనదానికిని, మనోవ్యాధికిని, వ్యసనమునకును, బంధనమునకును పేరు.

బోధిః-॥పు॥ ఇది సమాధికిని, కోడికిని, రావిచెట్టునకును, బుద్ధికిని పేరు.

అబ్ధిః - ॥పు॥ ఇది కొలనికిని, సముద్రమునకును పేరు.

బంధుః - ॥పు॥ ఇది మంకెనచెట్టునకును, బంధువునకును పేరు.

గంధః-॥పు॥ ఇది గంధకమునకును, సంబంధమునకును, పరిమళమునకును, లేశమునకును, గర్వమునకును పేరు.

స్కంధః-॥పు॥ ఇది బౌద్ధశాస్త్రమునఁజెప్పిన రూపవేదనావిజ్ఞాన సంజ్ఞాసంస్కారములను పంచస్కంధములకును, మూఁపునకును, వేళ్లు మొదలుకొని కొమ్మలవఱకుఁగలచెట్టుయొక్క మధ్యభాగమునకును, గుంపునకును, రాజునకును పేరు.

విధా-॥స్త్రీ॥ ఇది చేయుంటకును, గజాన్నమునకును, ప్రకారమునకును, కూలికిని పేరు.

సుధా - ॥స్త్రీ॥ ఇది అమృతమునకును, సున్నముపూఁతకును, చాఁగకును, సర్పాశనమునకును, జెముడుచెట్టునకును పేరు.

వధూః-॥స్త్రీ॥ ఇది నూతనముగ వివాహము చేయఁబడిన పెండ్లికూఁతునకును, కోడలికిని, భార్యకును, స్త్రీకిని, సుగంధపాలతీఁగెకును పేరు.

గోధా - ॥స్త్రీ॥ఇది వింటినారిదెబ్బతగులకుండుటకై చేతఁగట్టుకొను తోలునకును, నీరుడుమునకును పేరు.

ఋద్ధిః-॥స్త్రీ॥ఇదిసంతోషమునకును,సుఖమునకును,వృద్ధికిని పేరు.

సంధా-॥స్త్రీ॥ ఇది మర్యాదకును, ప్రతిజ్ఞకును పేరు.

శ్రద్ధా-॥స్త్రీ॥ ఇది కలదనునమ్మకమునకును, ఇచ్ఛకును పేరు.

మిద్ధమ్-॥న॥ ఇది ఆలస్యమునకును, నిద్రకును పేరు.

అర్ధః - ఇది ఖండమునకుఁ బేరగునపుడు ॥పు॥ సమాంశమునకుఁ బేరగునపుడు ॥న॥

మధుః-ఇది చైత్రమాసమునకును, వసంతర్తువునకును, విష్ణువునకును, రాక్షసునకును, పేరైనపుడు॥పు॥ ఉదకమునకును, పాలకును పూఁదేనెకును, భ్రామరమను తేనెకును, ఇప్పపువ్వుకల్లు

మకరన్దేఽష్ట్రే మద్యయో ర
స్త్రీ. ౨౨౪
రాధా కర్ణ స్యోపమా
తా విశాఖా గోపికాసు చ,
నా వైశాఖే
౽థ బాధాస్యా ద్వానా
దుఃఖనిషేధయోః. ౨౨౫
సిద్ధః పుమాన్ దేవయో
నా నిత్యనిష్పన్నయో స్త్రిషు,

దిగ్ధో విషాక్తబాణే నా
త్రిషు లిప్తప్రబుద్ధయోః.
౨౨౬
త్రిషు స్యా ద్బుధితే బు
ద్ధం విద్వత్సుగతయోః పు
మాన్,
శ్రద్ధావతి త్రిషు శ్రాద్ధ
పితృకృత్యేతు న ద్వయోః.
సాధు స్త్రిషూచితే చారౌ
సభ్యే వార్ధుషికే ౽పి
నా,
వినేత్రే౽న్ధ స్త్రిషు ధ్వా
న్తే క్లీబే
సింధు స్తు వారిధౌ. ౨౨౭
దేశే నదే గజమదే నా
నద్యాంతు స్త్రియా మయం,
దుగ్ధం నపుంసకం క్షీరే
ఛేద్యలింగం ప్రపూరితే.
లుబ్ధో నా మృగయా
గృధ్నౌ త్రిలింగ స్సాన్యవ
దథ త్రిషు, ముగ్ధ స్సా
మ్యే నవే మూఢే

నకును పేరగునపుడు ॥స్త్రీ॥

రాధా – ఇదికర్ణునిదాదికిని, విశాఖానక్షత్రమునకును, రాధ యను గోపికకును పేరైనపుడు ॥సీ॥ వైశాఖమాసమునకు పేరైనపుడు ॥పు॥

బాధా–॥స్త్రీ॥ ఇది దుఃఖమునకును, నిషేధమునకును పేరు.

సిద్ధః – ఇది దేవయోనివిశేషమయినసిద్ధునికిఁ బేరైనపుడు ॥పు॥ నిత్యమయిన దానికిని, పాకాదులచేత నాయత్తమయిన యన్నాదులకును పేరైనపుడు ॥త్రి॥

దిగ్ధః – ఇది విషముచేఁబూయఁబడిన బాణమునకు పేరైనపుడు ॥పు॥ లేపముచేయఁబడినదానికిని, వికసించినదానికిని పేరైనపుడు ॥త్రి॥

బుద్ధమ్ – ఇది మేలుకొన్నవానికి పేరైనపుడు ॥త్రి॥ విద్వాంసునకును, బుద్ధదేవునకును పేరైనపుడు ॥పు॥

శ్రాద్ధః–ఇది శ్రద్ధగలవానికి పేరైనపుడు ॥త్రి॥ పితృకార్యమునకు పేరైనపుడు ॥న॥

సాధుః – ఇదియోగ్యమయినదానికిని, సుందరమైనదానికిని పేరైనపుడు ॥త్రి॥ సభాయోగ్యునకును, వడ్డివల్లజీవించువానికిని పేరైనపుడు ॥పు॥

అంధః – ఇది గ్రుడ్డివానికి పేరైనపుడు॥త్రి॥ అంధకారమునకు పేరైనపుడు ॥న॥

సింధుః – సముద్రమునకును, సింధుదేశమునకును, పడమరగా ప్రవహించుపురుషనదమునకును, ఏనుఁగుమదమునకును పేరైనపుడు ॥పు॥ నదికి పేరైనపుడు ॥సీ॥

దుగ్ధమ్ – ఇది పాలకు పేరైనపుడు ॥న॥ నిండింపఁబడిన దానికి పేరగునపుడు విశేష్యలింగము.

లుబ్ధః – ఇది వేఁటగానికి పేరైనపుడు ॥పు॥ ఆశగలవానికి పేరైనపుడు ॥త్రి॥

ముగ్ధః-॥త్రి॥ ఇది సాధునకును, క్రొత్తదానికిని, మూఢునకును పేరు.

స్త ద్రుమమన్మథాః,
తపనా గ్రీష్మభల్లాత నర
కాన్తరభాస్కరాః. ౧౩౫
సన్తానా స్స్యు రవిచ్ఛిత్తి
వంశాపత్యసురద్రుమాః,
తమోనుదో ఽగ్నిచన్ద్రా
ర్కాః
శ్శకునీ రాజపక్షిణోః.
అరత్నిః కూర్పరే సప్ర
కోష్ఠోర్ధ్వాఙ్గుళి హస్తకే,
ఉదాన ముదరావర్తే సర్ప
మారుతభేదయోః. ౧౩౬
రఞ్జనీ రోచనా నీల్యో
ర్వన్దాయా మపి కామినీ,
పద్మినీ స్త్రీ దారవామ్బు
పాత్రే చ పశుభక్షణే.
హ్రాదినీ వజ్రతటితో
శ్శిఞ్జినీ నూపురజ్యయోః,
వాహినీ సైన్యసరితో
ర్వర్తనీ వృత్తిమార్గయోః.
పద్మినీ కరిణీ శ్రీ స్త్రీవరో
ష్ణనలినీషుచ,
వాణినీ నర్తకీ మత్తా వి
దగ్ధా స్వ
థ మాలినీ. ౧౪౦. మాలా
కారస్త్రియాం గౌర్యాం
స్వర్ణదీవృత్తభేదయోః,
సన్ధిన్యకాలదుగ్ధా గౌరా
క్రాంతా వృషభేనచ. ౧౪౧
పూతనా రాక్షసీ పథ్యా
భావనా ధ్యానయత్నయోః,

వసంతర్తువునకును, మంగచెట్టునకును, మన్మథునకును నామము.

తపనః - ॥పు॥ ఇది గ్రీష్మర్తువునకును, జీడిమ్రానికిని, నరక విశేషమునకును, సూర్యునికిని నామము.

సంతానః - ॥పు॥ ఇది ఎడతెగకయుండుటకును, వంశమునకును, పుత్రులకును, కల్పవృక్షమునకు నామము.

తమోనుత్ - ॥పు॥ఇది అగ్నికిని, చంద్రునికిని, సూర్యునికిని నామము.

శకునిః - ॥పు॥ ఇది ఒకరాజునకును, పక్షికిని నామము.

అరత్నిః - ॥పు॥ ఇది మోఁచేతికిని, చాఁపఁబడిన చిటికెన వ్రేలుంగలపిడికిలితోఁగూడిన మూరకుఁబేరు.

ఉదానమ్ - ॥న॥ ఇది ఉదరమునఁబుట్టిన సుడికిని, సర్ప విశేషమునకును, కంఠదేశమునుండు వాయువునకును పేరు.

రంజనీ-॥సీ॥ఇది గోరోచనమునకును, నీలిచెట్టునకును పేరు.

కామినీ - ॥సీ॥ ఇది బదనికకును, అపిశబ్దమువలన విలాసిని యయిన స్త్రీకిని పేరు.

పద్మినీ - ॥సీ॥ ఇది కొయ్యతోఁజేరిన యుదకపాత్రమునకును, యజ్ఞమునందు పశుభక్షణమునకును నామము.

హ్రాదినీ-॥సీ॥ ఇది వజ్రాయుధమునకును, మెఱుపునకును పేరు.

శింజినీ - ॥సీ॥ ఇది కాలియందెకును, నారికిని నామము.

వాహినీ - ॥సీ॥ ఇది సేనయొక్క కూటమికిని, నదికిని పేరు.

వర్తనీ-॥సీ॥ఇది జీవనోపాయమునకును, కాలిత్రోవకును పేరు.

పద్మినీ - ॥సీ॥ ఇది ఆఁడుయేనుఁగునకును, లక్ష్మికిని, పద్మినీ జాతిస్త్రీకిని, కొలనికిని, తామరతీఁగెకును నామము.

వాణినీ-॥సీ॥ ఇది నాట్యమాడుస్త్రీకిని, మత్తురాలికిని, ప్రౌఢురాలికిని నామము.

మాలినీ - ॥సీ॥ ఇది పువ్వులుగట్టి యమ్మువానికిని, భార్యకును, పార్వతికిని, గంగకును, మాలినీవృత్తమునకును నామము.

సంధినీ - ఇది ఈనుకపోయిన యావునకును, పదనై యాఁబోతుచేత వెంటాడఁబడిన యావునకును నామము.

పూతనా - ॥సీ॥ ఇది రాక్షసస్త్రీకిని, కరకచెట్టునకును పేరు.

భావనా - ॥సీ॥ ఇది ధ్యానమునకును, యత్నమునకును పేరు.

భువనం ఖామ్బు లోకేషు
భవనం భావ వేశ్మనోః.
నిధనం నాశ కులయో
ర్వసనం వాసవస్త్రయోః,
బన్ధోపరత్యో ర్దమనం
సేవనం స్స్యూతి సేవయోః.
౨౪3
ప్రజ్ఞానం లాఞ్ఛనధియో
ర్దశనం దంశ వర్మణోః,
క్రన్దనం రోదనాహూత్యో
రోదనం క్రన్దనాశ్రుణోః,
ప్రసూనం పుష్పఫలయో
ర్లాఞ్ఛనం నామలక్ష్మణోః,
స్తతనం గర్జిత ధ్వన్యో
ర్గహనం వనదుఃఖయోః.
బన్ధనం బన్ధవధయో
ర్భాజనం యోగ్య పాత్ర
యోః,
ఛేదనం కర్తనే భేదే
తోదనం తోత్ర తోదయోః.
ప్రథనం దారణే యుద్ధే
మేహనం మూత్ర శేఫసోః,
ఉద్ధాన ముద్గమే చుల్ల్యా
మవనం ప్రీతిరక్షయోః.
శాసనం నిష్కర గ్రామే
నిగ్రహే వేదశాస్త్రయోః,
వాజ్ఞయోగే ప్రహరణే
స్యాల్లేఖే కర్మవాక్యయోః
స్యాన్నిదానం వత్సదామ
న్యాది కారణ ఖణ్డయోః,

భువనమ్ - ॥న॥ ఇది ఆకాశమునకును, ఉదకమునకును, లోకమునకును నామము.

భవనమ్-॥న॥ ఇది అభిప్రాయమునకును, గృహమునకును పేరు.

నిధనమ్-ఇది నాశమునకును, కులమునకును నామము.

వసనమ్-॥న॥ ఇది ఉనికికిని, వస్త్రమునకును నామము.

డమనమ్-॥న॥ ఇది కట్టుటకును, చాలించుటకును నామము.

సేవనమ్ - ॥న॥ ఇది కోకలు మొదలైనవానిం గట్టుటకును, కొలువుగొలుచుటకును నామము.

ప్రజ్ఞానమ్ - ॥న॥ ఇది గుఱుతునకును, బుద్ధికిని నామము.

దశనమ్-॥న॥ఇది కఱచుటకును, కవచమునకును నామము.

క్రందనమ్-॥న॥ ఇది ఏడ్చుటకును, పిలుచుటకును నామము.

రోదనమ్-॥న॥ ఇది ఏడ్చుటకును, కన్నీటికిని నామము.

ప్రసూనమ్-॥న॥ఇది పుష్పమునకును, ఫలమునకును నామము.

లాంఛనమ్ - ॥న॥ ఇది నామధేయమునకును, గుఱుతునకును పేరు.

స్తపనమ్ - ॥న॥ ఇది మేఘగర్జితములకును, ధ్వనికిని నామము.

గహనమ్ - ॥న॥ ఇది అడవికిని దుఃఖమునకును నామము.

బంధనమ్-॥న॥ ఇది కట్టుటకును, చంపుటకును నామము.

భాజనమ్-॥న॥ ఇది యోగ్యమునకును, పాత్రకును నామము.

ఛేదనమ్-॥న॥ ఇది ఛేదించుటకును, భేదమునకును నామము.

తోదనమ్-॥న॥ ఇది ముల్లుకఱ్ఱకును, పోవుటకును నామము.

ప్రథనమ్-॥న॥ ఇది కోయుటకును, యుద్ధమునకును నామము.

మేహనమ్-॥న॥ఇది మూత్రమునకును, శిశ్నమునకును నామము.

ఉద్ధానమ్ - ॥న॥ ఇది పైకిలేచుటకును, పొయికిని నామము.

అవనమ్-॥న॥ఇది సంతోషమునకును, రక్షించుటకును నామము.

శాసనమ్ - ॥న॥ ఇది కప్పములేని గ్రామమునకును, నిగ్రహించుటకును, వేదశాస్త్రములకును, ఆజ్ఞకును, కొట్టుటకును, పత్రికకును, కర్మకును, వాక్యమునకును నామము.

నిదానమ్-॥న॥ఇది దూడ బలుపునకును, ఆదికారణమునకును, ఖండమునకును నామము.

కాలీనం సుకులీనత్వే ప్రాణి
ద్యూతాపవాదయోః.
స్యాత్కౌపీన మకార్యే
చ గుహ్యచీరప్రభేదయోః,
బీజావాపేఽపి వపనం
హింసాయా మపి వర్జనమ్.
వర్ధనం ఛేదనేఽపి స్యా
చ్ఛతుష్కోశే చ యోజ
నమ్,
రాశిభేదేఽపి మిథునం
సంగతా వపి మైథునమ్.
౨౫౧
తేమనం వ్యంజనే క్లీబే
సవ్యానం ఛాదనేఽంశుకే
సవనం సోమనిష్పేషే జన
న స్నానయోరపి. ౨౫౨
అయనం నిలయే మార్గే ద
క్షిణోదగ్గతౌ రవేః,
జఘనం కామినీశ్రోణీపురో
భాగే కటిస్థలే. ౨౫౩
ఆసనం కుఞ్జరస్కన్ధే పీఠే
యాత్రానివర్తనే,
దర్శనం దర్పణస్వప్నబుద్ధి
శాస్త్రాక్షివృష్టిషు. ౨౫౪
కేతనం గేహచిహ్నజకృ
త్యామన్త్రణకేతుషు,
ఉత్థాన ముద్గమాఽఽకాంక్షా

కాలీనమ్-॥న॥ ఇది సత్కులవంతుఁడగుటకును, పశుపక్షిమ్మ గాదులయుద్ధమునకును, లోకాపవాదమునకును పేరు.

కౌపీనమ్-॥న॥ అకార్యమునకును, గుహ్యమునకును, గోఁచి కిని పేరు.

వపనమ్-॥న॥ ఇది విత్తనము విత్తుటకును, అపిశబ్దమువలన గొఱుగుటకును పేరు. [పేరు

వర్జనమ్-॥న॥ ఇది హింసకును, అపిశబ్దమువలన విడుచుటకును

వర్ధనమ్-॥న॥ ఇది ఛేదించుటకును, అపిశబ్దమువలన వృద్ధినొం దుటకును పేరు.

యోజనమ్-॥న॥ ఇది ఆమడదూరమునకును, చకారమువల నొకవస్తువును మఱియొకదానితోఁ గూర్చుటకును పేరు.

మిథునమ్-॥న॥ ఇది రాశిభేదమునకును, అపిశబ్దమువలన స్త్రీ పురుషులజంటకును పేరు.

మైథునమ్-॥న॥ ఇది బంధమునకును, అపిశబ్దమువలన సుర మునకును పేరు.

తేమనమ్-॥న॥ ఇది మజ్జిగ, చారు, ఊరుపిండి మొదలై దానికి పేరు. [పే

సవ్యానమ్-॥న॥ ఇది ఉత్తరీయమునకును, కట్టువస్త్రమునకు

సవనమ్-॥న॥ ఇది సోమలతను నూఱుటకును, పుట్టుటకు స్నానమునకును పేరు.

అయనమ్-॥న॥ ఇది స్థానమునకును, త్రోవకును, సూరు యొక్క యుత్తరదక్షిణగమనములకును పేరు.

జఘనమ్-॥న॥ ఇది స్త్రీలయొక్క మొలకుముందఱిదిక్కు న్నప్రదేశమునకును-అనఁగా మడికట్టునకును, పిఱుఁదులకును పే

ఆసనమ్ - ॥న॥ ఇది ఏనుఁగుమూఁపునకును, పీఠమునకు యుద్ధసమయమునను జూచుటకును పేరు.

దర్శనమ్-॥న॥ ఇది అద్దమునకును, స్వప్నమునకును, బుద్ధి శాస్త్రమునకును, కంటికిని, చూపునకును పేరు.

కేతనమ్-॥న॥ ఇది గృహమునకును, గుఱుతునకును, శరీ నకును, చేయఁదగిన కార్యమునకును, బ్రాహ్మణుల నిమంత్ర చేయుంటకును, టెక్కెమునకును పేరు.

ఉత్థానమ్-॥న॥ ఇది కూర్చున్నవాఁడు లేచుటకును, ఆశా

తన్త్రే పౌరుషవస్తుషు. ౨౫౫
వ్యుత్థానం తు స్వతన్త్రత్వ
కరణం ప్రతికూలతా,
ప్రధానం పరమాత్మాఽఽది
రమాత్యే ప్రకృతి రుత్తమః.
౨౫౬
ప్రస్థాపనే నిరసనే కాల
క్షేపే చ యాపనమ్,
ఉద్యానం స్యా న్నిస్సరణే
వనభేదే ప్రయోజనే. ౨౫౭
సంస్థాన మాకృతౌ మృ
త్యౌ సన్నివేశే చతుష్పథే,
వ్యసనం త్వశుభే భ్రంశే
విపత్తౌ నిష్ఫలోద్యమే.
౨౫౮. దైవానిష్టఫలే పాపే
దోషే కామజకోపజే,
స్యా ద్విధానం వేతనా
యా ముపాయే ప్రేరణే ధ
నే. ౨౫౯. ప్రకారే హస్తి
కబళే పూజాయాం వైర
కర్మణి,
వ్యఞ్జనం తేమనే చిహ్నే
శ్మశ్రు ణ్యవయవేఽక్షరే
౨౬౦
వేష్టనం మకుటోష్ణీషే
గన్ధనం తు ప్రకాశనే,
సూచనే చాపి హింసాయై
పరస్యోత్సాహనే చ తత్.
సాధన మనుగతి గత్యో
శ్శేఫసి సిద్ధౌ నివృత్తౌ దాప
నయోః, మృతసంస్కారే
హేతౌ ధనహింసా యాత

కును, తంత్రమునకును, పురుష ప్రమాణమునకును, వస్తువునకును పే.

వ్యుత్థానమ్-॥న॥ ఇది స్వాతంత్ర్యముఁ జేయుటకును, ప్రతికూలము చేయుటకును పేరు.

ప్రధానమ్-॥న॥ ఇది పరమాత్మకును, మొదటికిని, మధ్యములై యాలోచనకుండఁదగిన మంత్రి సేనాపతి మొదలైనవారికిని, ప్రకృతికిని, ముఖ్యునకును పేరు.

యాపనమ్-॥న॥ ఇది పంపుటకును, తిరస్కారమునకును, కాలక్షేపమునకును పేరు.

ఉద్యానమ్-॥న॥ ఇది గృహమునిడచి బైలుదేరుటకును, శృంగారపుఁదోఁటకును ప్రయోజనమునకును పేరు.

సంస్థానమ్-॥న॥ ఇది ఆకృతికిని, మరణమునకును, ఊరుచుట్టుబైటికిని, నాలుగుతెరువులు చేరిన ప్రదేశమునకును పేరు.

వ్యసనమ్-॥న॥ ఇది అశుభమునకును, జాఱుటకును, విపత్తునకును, ఫలహీనమైన ప్రయత్నమునకును, దైవయోగముచే సంభవించు విపరీతమునకును, కామక్రోధాదులవల్లఁ బుట్టిన స్త్రీద్యూతాదిసప్తవ్యసనములకును పేరు.

విధానమ్-॥న॥ ఇది కూలికిని, ఉపాయమునకును, ప్రేరణమునకును, ధనమునకును, ప్రకారమునకును, ఏనుఁగుకబళమునకును పూజకును, విరోధకర్మకును పేరు.

వ్యంజనమ్-॥న॥ ఇది మజ్జిగ, చారు, ఊరుబిండి మొదలైనదానికిని, చిహ్నమునకును, గడ్డము మీసములకును, స్త్రీపురుషుల గుహ్యావయవములకును, కకారాదిహకారాంతవర్ణములకును పేరు.

వేష్టనమ్-॥న॥ ఇది తలపాగకు పేరు.

గంధనమ్-॥న॥ ఇది ప్రకాశమునకును, పరులహింసించుకొఱకు కొండెము చెప్పుటకును, ఉత్సాహమునకును, చకారమువలన నలుగుపెట్టుటకును పేరు.

సాధనమ్-॥న॥ ఇది వెంటఁబోవుటకును, గమనమునకును, శిశ్నమునకును, సిద్ధికిని, మగుడుటకును, అప్పుపుచ్చుకొనినద్రవ్యము నిప్పించుటకును, మృతుని సంస్కరించుటకును, పక్షాంతరమున వసనాభిమొదలైనవానివిషమును బోఁగొట్టుటకును, కార

రాసు సేనాఙ్గే. ౧౬౨

లఙ్ఘనం తూపవాసేఽపి
సలిలేఽపిచ జీవనమ్,
జీవంత్యాం జీవనీ చా
థ క్రీడాయామపి దేవ
నమ్. ౧౬౩. నాఽస్త్రీ
థ దళనం క్లీబే కవచే ద
(నే పుమాన్,
స్యన్దనం స్రవణే తోయే
నా తు నేమిద్రుమే రథే.
గోస్తనో హారభేదేఽపి మృ
ద్వీకాయాం తు గోస్తనీ,
వృజినం కిల్బిషే క్లీబే క్లేశే
నా కున్తలే త్రిషు. ౧౬౪
శయ్యాయాం శయనం న
స్త్రీ క్లీబే సురతనిద్రయోః,
శమనం శాన్తివధయోః
క్లీబే వైవస్వతే పుమాన్.
పాకస్థానే కులాలస్య
పవనం మారుతే పుమాన్
అపానో వాయుభేదే స్యా
దపానం గుదముష్కయోః.
నిశ్వాసే శ్వసనం నా తు
మారుతే మదనద్రుమే,
అస్త్రీ వితాన ముల్లోభ
విస్తార మఖ సద్మసు. ౧౬౫
తుచ్ఛే మన్దే త్రిష్వ
థాస్త్రీ వ్రీహ్యబ్దార్చిస్సు
హాయనః,
శకునం మఙ్గళాశంసనిమి
త్తే శకునః ఖగే. ౧౬౬

ణమునకును, ధనమునకును, చంపుటకును, అతిశయమైన వేదన
కును, సైన్యమునకును పేరు. [దాటుటకును పేరు.

లంఘనమ్ – ॥న॥ ఇది ఉపవాసమునకును, అపిశబ్దమువలన
జీవనమ్–॥న॥ ఇది ఉదకమునకును, అపిశబ్దమువలన బ్రతు
జీవనీ– ॥సీ॥ ఇది పాలకూరకు పేరు. [కుటకును పేరు.

దేవనమ్–ఇది క్రీడకును, అపిశబ్దమువలన విలాసమునకును
పేరగునపుడు ॥న॥ జూదమునకుఁ బేరగునపుడు ॥పు॥

దళనమ్–ఇది కవచమునకు పేరగునపుడు ॥న॥ పగుల్చుటకు
పేరగునపుడు ॥పు॥

స్యందనమ్–ఇది స్రవించుటకును, ఉదకమునకును పేరయిన
పుడు ॥న॥ నెమ్మిచెట్టునకును, రథమునకును పేరయినపుడు ॥పు॥

గోస్తనః–ఇది నలువదిసరములుగలహారమునకు పేరయినపుడు
॥పు॥ ద్రాక్షకు పేరయినపుడు ॥సీ॥ గోస్తనీ.

వృజినమ్–ఇది పాపమునకు పేరైనపుడు ॥న॥ క్లేశమునకు
పేరైనపుడు ॥పు॥ వెండ్రుకలకు పేరయినపుడు ॥త్రి॥
శయనమ్–ఇది పాన్పునకు పేరైనపుడు ॥ప్న॥ సురతమునకును
నిద్రకును పేరయినపుడు ॥న॥

శమనమ్–ఇది శాంతికిని,వధకును పేరయినపుడు ॥న॥ యము
నికి పేరగునపుడు ॥పు॥

పవనమ్–ఇది కుమ్మరవాని వంటయింటికిఁ బేరయినపుడు ॥న॥
వాయువునకు పేరయినపుడు ॥పు॥

అపానః–ఇది వాయువిశేషమునకు పేరయినపుడు ॥పు॥ గుద
స్థానమునకును, వృషణమునకును పేరయినపుడు ॥న॥

శ్వసనమ్–ఇది ఊర్పునకు పేరయినపుడు ॥న॥ గాలికిని, మంగ
చెట్టునకును పేరగునపుడు ॥పు॥

వితానమ్–ఇది మేల్కట్టునకును, విస్తారమునకును, యజ్ఞము
నకును, గృహమునకును పేరయినపుడు ॥ప్న॥ తుచ్ఛమైనదాని
కిని, మందునికిని పేరయినపుడు ॥త్రి॥

హాయనః–॥ప్న॥ ఇది ధాన్యవిశేషమునకును, సంవత్సరమున
కును, కిరణమునకును పేరు.

శకునమ్–ఇది శుభమును తెలియఁజేయు నిమిత్తమునకు పేర
యినపుడు ॥న॥ పక్షికి పేరగునపుడు ॥పు॥

సమానః ప్రాణభేదే నా త్రి ష్వేకసమసాధుషు,
మలినీ ఋతుమత్యాం స్త్రీ కృష్ణదూషితయో స్త్రిస్వషు.

స్పర్శే త్వగిన్ద్రియే దానే స్పర్శనం మారుతే పుమాన్,
ధావనం ధావనే శుద్ధౌ ధావనీ రజకస్త్రియామ్.
పద్మాకరే తు నళినో నళినీ నళినం జలే, పద్మేఽ
థ కుహనా దమ్భచర్యాయాం త్రిష్వసూయకే.
ప్రసన్నా మదిరాయాం స్త్రీ ప్రసాదవతివాచ్యవత్,
స్యాన్మణ్డన మలఙ్కారే ఽలఙ్కరిష్ణౌతు వాచ్యవత్.
నన్దనం వాసవోద్యానేసుతే నాహర్షకే త్రిషు,

అఞ్జనా వాయుపత్నీ నా దిగ్గజే కజ్జలేఽఞ్జనమ్. ౨౭౪
సజ్జనా కల్పనాయాం స్త్రీ సజ్జనం తూపరక్షణే, త్రిషు సాధౌ
చేతనా తు జ్ఞానే స్త్రీ ప్రాణిని త్రిషు. ౨౭౫
విమానోఽస్త్రీ దేవయానే సప్తభూమికసద్మని,
సుమనాః పుష్పమాలత్యోః స్త్రీన్యయాం దేవే బుధే చ నా. ౨౭౬

సమానః-ఇది ప్రాణభేదమునకు పేరగునపుడు ॥పు॥ ఒక్కటైనదానికిని, సదృశమైనదానికిని, సజ్జనునికి పేరయినపుడు॥త్రి॥

మలినీ-ఇది ఋతుమతియైన స్త్రీకి పేరయినపుడు ॥స్త్రీ॥ నల్లనిదానికిని, దోషయుక్తమైనదానికిని పేరయినపుడు, మలినః, మలినం, మలినీ, అని ॥త్రి॥

స్పర్శనమ్-ఇది తాఁకుటకును, త్వగింద్రియమునకును, దానమునకును పేరగునపుడు ॥న॥ గాలికి పేరగునపుడు ॥పు॥

ధావనమ్-ఇది పరుగెత్తుటకును, శుద్ధికిని పేరయినపుడు ॥న॥ చాకలిదానికి పేరయినపుడు, ధావనీ ॥స్త్రీ॥

నలినః-ఇది కొలనికి పేరయినపుడు ॥పు॥ నళినీ అని స్త్రీలింగముగలదు. ఉదకమునకును, కమలమునకును పేరయినపుడు ॥న॥

కుహనా-ఇది దంభాచారములకు పేరయినపుడు ॥స్త్రీ॥ అసూయాపంతునికి పేరయినపుడు ॥త్రి॥

ప్రసన్నా-ఇది మద్యమునకు పేరయినపుడు ॥స్త్రీ॥ స్వచ్ఛమైనదానికి పేరయినపుడు విశేష్యలింగము.

మణ్డనమ్-ఇది అలంకారమునకుఁ బేరైనపుడు॥న॥అలంకరించు స్వభావముకలదానికి పేరయినపుడు విశేష్యలింగము.

నన్దనమ్-ఇది ఇంద్రునియుద్యానమునకుఁ బేరయినపుడు ॥న॥ పుత్రునికి పేరయినపుడు ॥పు॥ ఆనందకరమయినదానికి పేరయినపుడు ॥త్రి॥

అంజనా-ఇది వాయుదేవునిభార్యకు పేరయినపుడు ॥స్త్రీ॥ దిగ్గజమునకుఁ బేరయినపుడు ॥పు॥ కాటుకకు పేరగునపుడు ॥న॥

సజ్జనా-ఇది ఏనుఁగును శృంగారించుటకు పేరగునపుడు ॥స్త్రీ॥ దండుకావలికొఱకు చుట్టునుంచినవెలుఁగు మొదలైనదానికి పేరగునపుడు ॥న॥ సాధువయినదానికిఁ బేరగునపుడు ॥త్రి॥

చేతనా-ఇది జ్ఞానమునకు పేరగునపుడు ॥స్త్రీ॥ ప్రాణవంతునకు పేరగునపుడు॥త్రి॥

విమానః-॥పున్న॥ ఇది దేవయానమునకును, ఏడుప్పరిగలుగల గృహమునకును బేరు.

సుమనాః-॥న్_స్త్రీ॥ ఇది పుష్పమునకును, జాజితీఁగెకును బేరు. దేవతలకును, పండితునకును బేరయినపుడు ॥పు॥

అయం పుష్పే బహుష్వేవ
లోధ్రవృక్షేఽపి మార్జనః,

స్యా దుత్తాన మగమ్భీరే
శయితోర్ధ్వముఖేఽపి చ.

రసనం స్నేహకషాయద్రవ
విషహేమాన్నరూప్య రా
స్నాసు, ధ్వనిలవనిర్యాసే
ష్వథ కాఞ్చ్యం స్త్రీ స్యాదు
జిహ్వాయో రసనా. ౨౭౮

పార్థేఽర్జునః కేకిని కార్త
వీర్యే నేత్రామయేఽప్యేక
సుతే చ మాతుః, వర్ణే ద్రు
మేచాథ సితే త్రిలిఙ్గో గవ్య
ర్జునీ హేమ్ని తృణేఽర్జు
నం స్యాత్. ౨౭౯

వేదనా స్త్రీ దుఃఖభోగే
జ్ఞానే క్లీబ
మథ త్రిషు, తలినం విరళే
చాల్పే
విలీనా లీన విద్రుతా.

వామనో వాచ్యవ త్ఖర్వే
విష్ణు దిగ్గజయోః పుమాన్,
అవలగ్నే విలగ్నేఽస్త్రీ
సంలగ్నే త్రి ష్వ
థ ద్వయోః. ౨౮౦. అశ
ని ర్విద్యుతి పవౌ

రోచనః కూటశాల్మలౌ,
రోచనా రక్తకల్హారే గవాం

అయం=ఈసుమనశ్శబ్దము, పుష్పే=పుష్పవాచకమైనపుడు, బహుష్వేవ=బహువచనమునందె వర్తించును.

మార్జన - ఇది లొద్దుగచెట్టునకు పేరైనపుడు ॥పు॥ అపి శబ్దమువలన చందనకుంకుమాదులచేత దేహమునందు మురికిఁ పోఁగొట్టుటకుఁ బేరైనపుడు ॥స్త్రీ॥

ఉత్తానం - ॥న॥ ఇది మిట్టయయినదానికిని, వెల్లికలపండుకొనినదానికిని బేరు.

రసనం - ॥న॥ ఇది చమురునకును, లవణరసమునకును, ద్రవమునకును, విషమునకును, బంగారమునకును, అన్నమునకును, వెండికిని, సన్నరాస్నకును, ధ్వనికిని, లేశమునకును, బంకకును బేరైనపుడు ॥న॥ మొలనూలికిని, రుచికిని, నాలుకకును బేరయినపుడు ॥స్త్రీ॥

అర్జునః - ఇది కుంతీపుత్రునకును, నెమలికిని, కార్తవీర్యునకును, కంటిరోగమునకును, తల్లికి నొక కుమారుఁడైనవానికిని, వర్ణమునకును, మద్దిచెట్టునకును బేరగునపుడు ॥పు॥ తెల్లని కాంతికిఁ బేరగునపుడు ॥త్రి॥ శ్రేష్ఠమైనగోవునకుఁ బేరగునపుడు అర్జునీ - అని స్త్రీలింగము. బంగారమునకును, తృణమునకును బేరగునపుడు ॥న॥

వేదనా - ఇది దుఃఖానుభవమునకుఁ బేరగునపుడు ॥స్త్రీ॥ జ్ఞానమునకుఁ బేరగునపు ॥న॥

తలినం - ॥త్రి॥ ఇది విరళమైనదానికిని, అల్పమైనదానికిని నామము. [నామము.

విలీనః - ॥పు॥ ఇది దాఁగినవానికిని, కరఁగినఘృతాదులకును

వామనః - ఇది పొట్టివానికిఁ బేరగునపుడు విశేష్యలింగము. విష్ణువునకును, దిగ్గజమునకును బేరగునపుడు ॥పు॥

విలగ్నః - ఇది నడుమునకుఁ బేరగునపుడు ॥ప్న॥ కూడినదానికిఁ బేరగునపుడు ॥త్రి॥

అశనిః-॥ప్స॥ ఇది మెఱుపునకును, వజ్రాయుధమునకును బేరు.

రోచనః - ఇది కొండబూరుగచెట్టునకుఁ బేరగునపుడు ॥పు॥ ఎఱ్ఱకలువకును, గోరోచనమునకును, శ్రేష్ఠమైన స్త్రీకిః

న్నా క్లిన్న జీర్ణార్ద్రా)

విక్లిన్నః - ॥పు॥ ఇది వెదచల్లఁబడినదానికిని, జీర్ణమైనదానికిని, తడిసినదానికిని నామము.

నా ఖల సూచకా,

సిశునః - ॥పు॥ ఇది దుర్జనునికిని, కొండెగానికిని నామము.

న్న ఆపత్ప్రాప్తేఽపి

ఆపన్నః - ॥పు॥ ఇది ఆపదనొందినవానికిని, అపశబ్దమువలన శత్రువులచేతఁ బట్టుపడినవానికిని పేరు.

న్న స్సాధితేఽపి చ ౨౮౩

సంపన్నః - ॥పు॥ ఇది రాజుచేత దండుగ గొనఁబడినవానికిని అపిశబ్దమువలన సంపదపొందినవానికిని పేరు.

ఇతి నాంతాః.

నాంతపదవర్గము ముగిసెను.

---

పః భూషణే బర్హే

ౌ త్యం సంహత తూణ

కలాపః - ॥పు॥ ఇది భూషణమునకును, నెమలిపింఛమునకును, మొలనూలికిని, కూటమికిని, అమ్ములపొదికిని నామము.

ః కల్పనే వేషే

ఆకల్పః - ॥పు॥ ఇది కల్పమునకు, అలంకరించుటకును పేరు.

పి భ్రాన్తి కల్ప ౨౮౪

వికల్పః - ॥పు॥ ఇది బుద్ధిభ్రమకును, బ్రహ్మకల్పమునకును పేరు.

శ్శత్రు చింతాయాం

ావాలయో రపి,

ఆవాపః - ॥పు॥ ఇది శత్రువిషయచింతకును, దున్నుటకును, పాదికిని నామము.

ః భర్త్సనా కృ

ావ్యాలఙ్కార చో

ః. ౨౮౫

ఆక్షేపః-॥పు॥ ఇది బెదరించుటకును, దున్నుటకును, కావ్యాలంకారభేదమునకును, ప్రశ్నకును నామము.

త్పాదపః పాదపీఠే

ానే మహీరుహే,

ా మునిమీనా ద్వా

పా పౌరుషాతపా

త్ జ్ఞాన తిథ్యో

పాదపః - ॥పు॥ ఇది పాదపీఠమునకును, కాలితోనడుచు వాహనమునకును, వృక్షమునకును నామము.

కశ్యపః - ॥పు॥ ఇది మునికిని, మత్స్యమునకును నామము.

ప్రతాపః-॥పు॥ఇది పౌరుషమునకును, ఎండకును నామము.

ప్రతిపత్-॥స్త్రీ॥ ఇది జ్ఞానమునకును, పాడ్యమికిని నామము.

థులి వీణయోః,

కచ్ఛపీ - ॥స్త్రీ॥ ఇది ఆఁడుతాఁబేటికిని, సరస్వతియొక్క వీణెకును నామము.

ఽస్త్రీ ద్రువిస్తారే

స్తమ్బ శాఖయోః

విటపే తు నా స్యా

విటపః - ఇది మ్రానియొక్క చిగురుకొమ్మలు మొదలైనవాని సమూహమునకును, చిగురునకును, వ్రేళ్లకొమ్మలకు నడిమిభాగము లేక యాఁకులు దట్టమయి యున్నదానికిని, కొమ్మకును పేరగునపుడు ॥న్న॥ విటునకుఁ బేరగునపుడు ॥పు॥

దుడుప స్త్రీవన్తౌ నౌ న ద్వయోః ప్లవే,

ఉడుపః – ఇది చంద్రునకుఁ బేరగునపుడు ॥పు॥ తెప్పకుఁ బేరగునపుడు ॥న॥

అస్త్రీ కళిపుశ్శయ్యాయాం వస్త్రేఽన్నే తద్ద్వయేఽపిచ.

కళిపుః – ॥ప్న॥ ఇది పాన్పునకును, వస్త్రమునకును, అన్నమునకును, ఏకోక్తిగా వస్త్రాన్నములకు రెంటికిని నామము.

కుతపోఽర్కేఽగవి విప్రే వహ్నా వతిథౌ చ భాగినేయే చ, అస్త్రీ దినాష్టమాంశే కుశతిలయో శ్ఛాగకమ్బళే ఫాలే. ౨౮౯

కుతపః – ఇది సూర్యునికిని, గోవునకును, బ్రాహ్మణునికిని, అగ్నికిని, అతిథికిని, చెల్లెలికొడుకునకును బేరగునపుడు ॥పు॥ దినము యొక్క యెనిమిదవభాగమునకును, దర్భకును, తిలలకును, మేఁకవెండ్రుకల కంబళికిని, నొసటికిని బేరగునపుడు ॥ప్న॥

ఇతి పాంతాః.

పాంతపదవర్గము ముగిసెను.

---

[త్ర్యక్షరఫాన్తా న సన్తి]

[మూఁడక్షరముల ఫాంతములు లేవు.]

హేరమ్బో మహిషేభాస్యౌ

హేరంబః-॥పు॥ ఇది మహిషమునకును, వినాయకునికిని పేరు.

ప్రలమ్బో హార దానవౌ,

ప్రలంబః – ॥పు॥ ఇది హారభేదమునకును, ప్రలంబుఁడను రాక్షసునికిని నామము.

కాదమ్బో కలహంసేషూ

కాదంబః-॥పు॥ఇది కలహంసకును, బాణమునకును నామము.

కదమ్బో నీప సంహతీ.

కదంబః-॥పు॥ ఇది కడిమిచెట్టునకును, సమూహమునకుం బేరు.

కలమ్బో నీప శిఖినా పాకభేదే కలమ్బ్యపి.

కలంబః – ॥పు॥ ఇది కడిమిచెట్టునకును, అగ్నికిని నామము. తీఁగె బచ్చలికి నామమయ్యేనేని కలంబీ ॥స్త్రీ॥

నితమ్బః స్త్రీకటేః పశ్చాద్భాగేఽద్రికటకే కటౌ.

నితంబః – ॥పు॥ ఇది స్త్రీలయొక్క పిఱుఁదుల వెనుకనుండు భాగమునకును, కొండనడిమికిని, పిఱుఁదులకును నామము.

బడబాఽశ్వా కుమ్భదాస్యో ర్యోషిద్భేదే ద్విజస్త్రియామ్,

బడబా – ॥స్త్రీ॥ ఆఁడుగుఱ్ఱమునకును, నీళ్లకడవలు మోయు బానిసెకును, స్త్రీభేదమునకును, బ్రాహ్మణస్త్రీకిని నామము.

బాడబో బ్రాహ్మణౌర్వాగ్నీ బాడబం బడబాగణే.

బాడబః – ఇది బ్రాహ్మణునికిని, బడబాగ్నికిని, నామమయ్యేనేని ॥పు॥ ఆఁడుగుఱ్ఱముల గుంపునకును, నామమయ్యేనేని ॥న॥

ఇతి బాంతాః.

బాంతపదవర్గము ముగిసెను.

---

ఋషభోఽద్రౌ కర్ణరన్ధ్రే వృషే మత్తగజే స్వరే, వనసూకరపుచ్ఛేఽ

ఋషభః – ॥పు॥ ఇది పర్వతవిశేషమునకును, కర్ణరంధ్రమునకును, ఎద్దునకును, మదపుటేనుఁగునకును, స్వరభేదమునకును, అడవిపందితోఁకకును, అపిశబ్దమువలన ఋషభమను నౌషధమున

థ వృషభః పుఙ్గవే వృషే.
విస్రమ్భః కేళికలహే
స్నేహవిశ్వాసయో రపి,

వృషభః-॥పు॥ ఇది పురుషశ్రేష్ఠునకును, ఎద్దునకును నామము.

విస్రంభః - ॥పు॥ ఇది క్రీడాకలహమునకును, స్నేహావకును, నమ్మికకును, అపిశబ్దమువలనఁ బరిచయమునకును, హించుటకును నామము.

స్యా ద్విష్కమ్భో నాటకాఙ్గే విసార ప్రతిబన్ధయోః,
౨౫౮. యోగభేదే

విష్కంభః-॥పు॥ఇది నాటకాంగమునకును, సామాన్యమత్యమునకును, ప్రతిబంధకమునకును, యోగభేదమునకును నామము.

ఽథ శరభోఽష్టాపదే చ
మృగాన్తరే.

శరభః - ॥పు॥ ఇది జూదమాడు పలకకును, ఎనిమిదికాళ్లు గలదై సింహమునుజంపెడి మృగమునకును నామము.

ఆత్మభూ ర్మన్మథే వేధ

ఆత్మభూః - ॥పు॥ ఇది మన్మథునికిని, బ్రహ్మకును నామము.

స్యారమ్భో వధ దర్ప
యోః. ౨౫౯. ఉద్యమే

ఆరంభః -॥పు॥ ఇది వధకును, అహంకారమునకును, ఉద్యోగమునకును నామము.

చాథ కకుభో వీణాఙ్గేఽ
ర్జునపాదపే,

కకుభః-॥పు॥ ఇది వీణాంగమైన కరివెకును, మద్దిచెట్టునకు నామము.

సనాభి స్సదృశజ్ఞాత్యో
రాలమ్భ స్స్పర్శహింస
యోః. ౨౬౦.

సనాభిః - ॥పు॥ ఇది సమానమునకును, జ్ఞాతికిని నామము.

ఆలంభః-॥పు॥ నలుగుపెట్టుటకును, హింసకును నామము.

కుసుమ్భం కుసుమే క్లీబం
స్యాన్మహారజనేఽపి తత్,
కమణ్డలౌ పుమా నేష

కుసుంభమ్ - ఇది సామాన్యముగా పుష్పమునకును, కుసుమపువ్వునకును, నామమయ్యెనేని ॥న॥ కమండలమునకు నామమయ్యెనేని ॥పు॥

సురభిస్తు గవి స్త్రియామ్.
౨౬౧. వసన్త చైత్రయోః
పుంసి త్రిషు సౌమ్య సుగ
న్ధినోః,

సురభిః - గోవునకు నామమయ్యెనేని ॥స్త్రీ॥ వసంతఋతువునకును, చైత్రమాసమునకును నామమయ్యెనేని ॥పు॥ సౌమ్యమైనదానికిని, సుగంధయుక్తమైనదానికిని నామమయ్యెనేని ॥త్రి॥

స్త్రియాం పునర్నవా భే
క్యో ర్వర్షాభూ ర్దర్దురే తు
నా. ౨౬౨

వర్షాభూః - ఇది గలిజేరుచెట్టునకును, ఆఁడుకప్పకును, నామమయ్యెనేని ॥స్త్రీ॥ కప్పకు నామమయ్యెనేని ॥పు॥

పుమాన్ భేర్యాం దున్దుభి
స్త్రీ(ని) త్వక్షబిన్దుత్రికేద్వయే

దుందుభిః-ఇది భేరికి నామమయ్యెనేని ॥పు॥ పాచికలయందు నిత్తిగకును నామమయ్యెనేని ॥స్త్రీ॥

వల్లభో నా కులీ నాశ్వే
దయితా ధ్యక్షయో స్త్రిషు.
ఇతి భాన్తాః.

వల్లభః - ఇది శ్రేష్ఠమైన గుఱ్ఱమునకు నామమయ్యెనేని ॥పు॥ ఇష్టునికిని, అధ్యక్షునికిని నామమయ్యెనేని ॥త్రి॥

భాంతపదవర్గము ముగిసెను.

నిగమో నిశ్చయే పుర్యాం
పథి వేదే వణిక్పథే,

నిగమః-॥పు॥ ఇది నిశ్చయమునకును, పట్టణమునకును, మార్గమునకును, వేదమునకును, అంగడివీథికిని నామము.

నైగమ స్తూపనిషది దన్తే
వణిజి నాగరే. ౩౦౦

నైగమః-॥పు॥ ఇది ఉపనిషత్తునకును, ఏనుఁగుదంతమునకును, వర్తకునికిని, పట్టణమునఁ బుట్టినవానికిని నామము.

విక్రమః క్రమణే కార్యే
ప్రక్రమోఽవసరే క్రమే,
సఙ్క్రమో వారియన్త్రే
ఽపి
ధీసామర్థ్యేఽపినిష్క్రమః. ౩౦౧

విక్రమః-॥పు॥ఇది ఆక్రమించుటకును, కార్యమునకును పేరు.

ప్రక్రమః-॥పు॥ ఇది ప్రస్తావమునకును, నడుపునకును పేరు.

సంక్రమః-॥పు॥ ఇది జలయంత్రమునకును, అపిశబ్దమువలన సూర్యుఁడు మేషాదిరాసులం గూడుటకును నామము.

నిష్క్రమః-॥పు॥ ఇది బుద్ధిసామర్థ్యమునకును, అపిశబ్దము వలన లోపలనుండి బైటవచ్చుటకును నామము.

విభ్రమ స్సంశయే భ్రా
న్తౌ స్యా ద్భావాన్తరశోక
యోః,

విభ్రమః-॥పు॥ ఇది సంశయమునకును, భ్రాంతికిని, స్త్రీల శృంగారభావమువల్లఁ బుట్టినక్రియకును,శోకమునకును నామము.

సమ్భ్రమో ఽత్యాదరే
భీతా వావేగే

సంభ్రమః-॥పు॥ ఇది మిక్కిలి యాదరణకును, భయమునకును, తొట్రుపాటునకును నామము.

నియమ స్త్వివహ. ౩౦౨
ప్రతిజ్ఞాజ్ఞాయన్త్రణాసుయో
గాఙ్గే నిశ్చయే వ్రతే,

నియమః-॥పు॥ ఇది ప్రతిజ్ఞకును, ఆజ్ఞకును, కట్టుటకును, యోగసాధనమునకును, నిశ్చయమునకును, వ్రతమునకును పేరు

కలమ శ్శాలిలేఖిన్యోశ్చౌ
రే లాక్షారసేఽఙ్కురే.

కలమః-॥పు॥ ఇది పైరునకును, పత్రికకును, దొంగకును, లాక్షారసమునకును, మొలకకును నామము.

ఆగమ స్త్వాగతౌ శాస్త్రే
విద్రుమో ద్రుప్రవాళయోః,
త్రిధామా కేశవే వహ్నౌ
హరిమా మృత్యుయోగ
యోః. ౩౦౪

ఆగమః-॥పు॥ ఇది వచ్చుటకును, శాస్త్రమునకును పేరు.

విద్రుమః-॥పు॥ ఇది వృక్షమునకును, పవడమునకును పేరు.

త్రిధామా-॥న్-పు॥ ఇది విష్ణువునకును, అగ్నికిని పేరు.

హరిమా-॥న్-పు॥ ఇది మృత్యువునకును, యోగమునకును పేరు.

గరుత్మా న్విహగే తార్క్ష్యే
ద్విజన్మా బ్రాహ్మణే ఖగే,

గరుత్మాన్-॥త్-పు॥ ఇది పక్షిసామాన్యమునకును, గరుత్మం[తునికిని పేరు.

ద్విజన్మా-॥న్-పు॥ ఇది బ్రాహ్మణునికిని, పక్షికిని పేరు.

వ్యాయామః పౌరుష
వ్యాయామ స్సఞ్చారో దుర్గ
సంహతిః. ౩౦౫

వ్యాయామః-॥పు॥ ఇది పురుషుని బారకును, సంచారమునకును, దుర్గసమూహమునకును పేరు.

గోలోమీ స్త్రీ వారనా
ర్యాం షడ్గ్రన్థా శ్వేత

గోలోమీ-॥స్త్రీ॥ ఇది వేశ్యకును,వసకును, తెల్లగఱికకును పేరు

దూర్వయోః,
కుసుమం పుష్పఫలయో
స్త్రీరజో నేత్రరోగయోః.
తలిమం కుట్టిమే తల్పే చ
ద్రిహాసౌ
థ గౌతమః, మునిభేదే
శాక్యసింహే గోదావ
ర్యాంతు గౌతమీ. ౩౦౭
పరమం స్యాదనుజ్ఞానేఽ
వ్యయం నా పరమాత్మని,
త్రిషూత్కృష్టే
పఞ్చమస్తు స్వరే నా పూ
రణే త్రిషు. ౩౦౮
మునిస్థానే మతే బ్రహ్మ
చర్యాదావాశ్రమోఽస్త్రి
యాం,
సుషమోత్కృష్ట శోభా
యాం త్రిషు చారౌ సమేఽ
ప్యథ. ౩౦౯
అశ్వభూషా పుణ్డ్రపుచ్ఛ
శ్రేష్ఠ శృంగారకేతునా, లిఙ్గే
ప్రభావే పురుషేలలామోఽ
స్త్రీ లలామ చ. ౩౧౦
సర్వేనా మధ్యమో దేహ
మధ్యే మధ్యే నపుంసకమ్,
మధ్యస్థే వాచ్యవత్ స్త్రీతు
హస్తమధ్యాఙ్గుళావపి. ౩౧౧
ఛన్దోభేదే దృష్టరజః కన్యా
యాం మధ్య
థ త్రిషు, సత్తమా శ్రేష్ఠ
పూజ్యౌ ద్వౌ
ప్రథమా ప్రవరా దిమౌ.

కుసుమమ్ - ॥న॥ ఇది పుష్పమునకును, ఫలమునకును, స్త్రీయొక్క ఋతువునకును, కంటివ్యాధికిని పేరు.

తలిమమ్ - ॥న॥ ఇది మేడలయొక్క యడుగుభూమికిని పాన్పునకును, పెద్దకత్తికిని పేరు.

గౌతమః - ॥పు॥ ఇది గౌతమమునికిని, బుద్ధదేవునికిని పేరు గోదావరికి పేరగునపుడు, గౌతమీ ॥స్త్రీ॥

పరమమ్ - ఇది అంగీకారమునకు పేరగునపుడు ॥న॥ పరమాత్మకు పేరగునపుడు ॥పు॥ శ్రేష్ఠునికి పేరగునపుడు ॥త్రి॥

పంచమః-ఇది సర్వవిశేషమునకును పేరగునపుడు ॥పు॥ పంచసంఖ్యాపూరకమైనదానికి పేరగునపుడు ॥త్రి॥

ఆశ్రమః-॥పు॥ ఇది మునులున్న స్థానమునకును, విద్యార్థులు మొదలైనవారికి స్థానమైన మఠమునకును, బ్రహ్మచర్యాద్యాశ్రమములకును పేరు.

సుషమా-ఇది శ్రేష్ఠమైనకాంతికి పేరగునపుడు ॥స్త్రీ॥ సుందరమైనదానికిని, సమమైనదానికిని పేరైనపుడు ॥త్రి॥

లలామః - లలామ-॥న॥-॥పు॥ ఇది గుఱ్ఱమునకును, ఆభరణమునకును, తిలకమునకును, తోకకును, శ్రేష్ఠమైనదానికిని, శృంగారమునకును, టెక్కెమునకును, గుఱుతునకును, ప్రభావమునకును, పురుషునికిని పేరు.

మధ్యమః - ఇది స్వరవిశేషమునకును, దేహమధ్యమునకును పేరైనపుడు ॥పు॥ మధ్యమునకు పేరైనపుడు ॥న॥ మధ్యస్థునకు పేరైనపుడు విశేష్యలింగము. చేతినడిమివ్రేలికిని, ఛందోభేదమునకును, క్రొత్తగా సమర్తాడినపడుచునకును పేరయినపుడు ॥స్త్రీ॥

సత్తమః-॥త్రి॥ ఇది శ్రేష్ఠునికిని, పూజ్యునికిని పేరు.

ప్రథమః - ॥పు॥ ఇది శ్రేష్ఠునికిని, మొదటివానికిని పేరు.

అధమౌ గర్హితన్యూనౌ వుత్తమౌ ప్రవరాన్తిమౌ,
ఇతి మాంతాః.

అధమః - ॥పు॥ ఇది నిందింపఁబడినవానికిని, తక్కువైనవానికిని పేరు.

ఉత్తమః - ॥పు॥ ఇది శ్రేష్ఠునికిని, తుదనున్న దానికిని పేరు.

మాంతపదవర్గము ముగిసెను.

---

ప్రణయస్స్యా త్పరిచయే విస్రమ్భే ప్రేమ యాచ్ఞయోః. ౩౧౩

ప్రణయః - ॥పు॥ ఇది పరిచయమునకును, నమ్మకమునకును, ప్రేమకును, యాచనకును పేరు.

వినయో నతిశిక్షాది ధర్మాచార ప్రశాన్తిషు,

వినయః - ॥పు॥ ఇది నమస్కారమునకును, శిక్ష మొదలైన వానికిని, ధర్మమునకును, ఆచారమునకును, ఉపశాంతికిని పేరు

అనయ స్త్వశుభే దైవే విపత్తౌ వ్యసనేఽప్యథ. ౩౧౪. పశ్చాదవస్థాయిబలే సమవాయే చ సన్నయః,

అనయః - ॥పు॥ ఇది పూర్వజన్మకృతమయిన యశుభకర్మకును, ఆపదకును, జూదము మొదలయిన సప్తవ్యసనములకును పేరు

సన్నయః - ॥పు॥ ఇది సేన వెనుకనుండు దుముదారి పౌఁజుకును, సమూహమునకును, చకారమువలన సంబంధమునకును పేరు

విషయో గోచరే దేశే జ్ఞాతో యోయస్య తత్ర చ. ౩౧౫

విషయః - ॥పు॥ ఇది శబ్దస్పర్శరూపరసగంధములకును, దేశమునకును, ఎవరిచేత నేది నిత్యమును పరిచయము చేయబడునో దానికిని బేరు.

ప్రళయో మరణే పాపే మూర్ఛా కల్పావసానయోః,

ప్రళయః - ॥పు॥ ఇది మరణమునకును, పాపమునకును, మూర్ఛకును, కల్పాంతమునకును బేరు.

ప్రత్యయోఽధీన విశ్వాస ధీ రన్ధ్రాచార హేతుషు. ఖ్యాతౌ సనాదౌ శపథే

ప్రత్యయః - ॥పు॥ ఇది అధీనమునకును, విశ్వాసమునకును బుద్ధికిని, రంధ్రమునకును, ఆచారమునకును, హేతువునకును ప్రసిద్ధికిని, సనాదిప్రత్యయములకును, శపథమునకును బేరు.

చిత్రగర్వౌ తు విస్మయౌ,

విస్మయః - ॥పు॥ ఇది ఆశ్చర్యమునకును, గర్వమునకును పే

వ్యవాయోఽన్తర్ధిరతయో

వ్యవాయః - ॥పు॥ ఇది దాఁగుటకును, రతిక్రీడకును బేరు

రుపాయ స్స్యాదుపాగతౌ. ౩౧౬. సామాదావథ

ఉపాయః - ॥పు॥ ఇది వచ్చుటకును, సామాద్యుపాయములకును బేరు.

సంస్థ్యాయ స్సన్నివేశే గృహే గణే,

సంస్థ్యాయః - ॥పు॥ ఇది పట్టణము చుట్టు బయలునకును, గృ మునకును, సమూహమునకును బేరు.

ఉదయః పూర్వశైలే స్యాదున్నతే వృద్ధగతౌ వపి.

ఉదయః - ॥పు॥ ఇది ఉదయపర్వతమునకును, ఉన్నతవ కును, ఊర్ధ్వగతికిని బేరు.

అపాయో ఽపగతే దోషే

అపాయః - ॥పు॥ ఇది మరణమునకును, దోషమునకును, దు

ఛ్ఛే)ఽతిక్రమదణ్డయోః,
నికాయో నిలయే లక్ష్యే
సముదాయే సధర్మిణామ్.
౩౧౯. అసంహతా నా మే
కత్ర కరణే పరమాత్మని
ఆశయా స్థాన తాత్పర్యా
కులాయ స్థానసీడయోః
పర్యాయః క్రమ నిర్యా
ణ ప్రకారావసరే ష్వపి, ఏ
కార్థవాచిశబ్దేచ
పౌలస్త్యౌ శ్రీద రావణౌ.
పర్జన్యో మేఘ నిర్ఘోషే
వాసవే గర్జదమ్బుదే,
శాణ్డిల్యో మునిమాలూరౌ
శ్వశుర్యో స్యాలదేవరౌ.
౩౨౨
ఆదిత్యో రవి గీర్వాణౌ
రోహిత్యో వ్రీహిసాగరౌ,
స్యా దామ్నాయ స్సం
ప్రదాయే కులేఽధ్యయన
వేదయోః. ౩౨౩
ఊర్ణాయుం రూర్ణా భేదేఽపి
మేషే తల్లోమకమ్బళే,
చరయుం ర్వారిదే వాతే
భ్రాతృవ్యో భ్రాతృజే
రిపౌ. ౩౨౪
సమయః కాల సిద్ధాన్త
ప్రతిజ్ఞా శపథేషుచ, సఙ్కే
తాచారయోశ్చా
థ స్వాధ్యాయో జప వే
దయోః. ౩౨౫
విశల్యా ఫలినీ దన్తీ గు

మునకును, అతిక్రమించుటకును, దండమునకును పేరు.

నికాయః - ॥పు॥ ఇది ఇంటికిని, గుఱికిని, ఒకనడత
గుంపునకును, ఒకచోటఁ జేరనివానిని నొకచోటఁ జేర్చు
పరమాత్మకును పేరు.

ఆశయః-॥పు॥ ఇది స్థానమునకును, తాత్పర్యమునకును

కులాయః - ॥పు॥ ఇది ఉనికికిని, గూటికిని పేరు.

పర్యాయః - ॥పు॥ఇది వరుసకును, మోక్షమునకును,
అవసరమునకును, సమానార్థకశబ్దమునకును పేరు.

పౌలస్త్యః - ॥పు॥ ఇది కుబేరునికిని, రావణునికిని పే

పర్జన్యః - ॥పు॥ ఇది మేఘధ్వనికిని, ఇంద్రునికిని, గ
మేఘమునకును పేరు. [కును

శాండిల్యః - ॥పు॥ ఇది శాండిల్యమునికిని, మారేడు

శ్వశుర్యః-॥పు॥ ఇది ఆలితోఁడఁబుట్టినవానికిని, మగనిత
బుట్టినవానికిని పేరు.

ఆదిత్యః - ॥పు॥ ఇది సూర్యునికిని, దేవతలకును పేరు.

రోహిత్యః-॥పు॥ఇది ధాన్యమునకును, సముద్రమునకును

ఆమ్నాయః-॥పు॥ ఇది సంప్రదాయమునకును, కులమును
చదువునకును, వేదమునకును పేరు.

ఊర్ణాయుః - ॥పు॥ ఇది తంతుభేదమునకును, గొఱ్ఱె
అగొఱ్ఱెరోమములకంబళికిని పేరు.

చరయుః-॥పు॥ ఇది మేఘమునకును, వాయువునకును పే

భ్రాతృవ్యః - ॥పు॥ ఇది తోఁడఁబుట్టినవాని కొడుకునక
శత్రువునకును పేరు.

సమయః - ॥పు॥ ఇది కాలమునకును, సిద్ధాంతమునకును,
జ్ఞకును, ఆన పెట్టుటకును, సంకేతమునకును, ఆచారమున
పేరు.

స్వాధ్యాయః-॥పు॥ ఇది జపమునకును, వేదమునకును పే

విశల్యా - ॥స్త్రీ॥ ఇది వెన్న వెదురుకూరకును, దంతిచెట్ట

దూచీ లాఙ్గలీషు చ,

కును, తిప్పతీఁగెకును, నీరుపిప్పలికిని, చకారమువలన పొవర చెట్టునకును పేరు.

అభిఖ్యా త్విడ్యశో నామ స్వేం

అభిఖ్యా - ॥స్త్రీ॥ ఇది కాంతికిని, కీర్తికిని, నామధేయమునకును పేరు.

ఇంద్రియం త్వక్షి రేతసోః.

ఇంద్రియమ్-॥న॥ఇది నేత్రమునకును, రేతస్సునకును పేరు.

సామర్థ్యం యోగ్యతాశశక్త్యో

సామర్థ్యమ్-॥న॥ఇది యోగ్యతకును, శక్తికిని పేరు.

హృదయం చిత్తవక్షసోః,

హృదయమ్-॥న॥ ఇది చిత్తమునకును, ఱొమ్మునకును పేరు.

చారుత్వ మపి సౌరభ్యం

సౌరభ్యమ్-॥న॥ ఇది ఒప్పిదమునకును, అపిశబ్దమువలన పరిమళమునకును పేరు.

నేపథ్యం రఙ్గభూ రపి. ౩౨౭

నేపథ్యమ్-॥న॥ ఇది నాట్యస్థానమునకును, అపిశబ్దమువలన నలంకరించుటకును పేరు.

పుత్ర్యాం పుత్రే ఽపి చాపత్య

అపత్యమ్-॥న॥ ఇది కొమార్తెకును, కొమారునికిని పేరు.

మౌచిత్యం సత్యయోగ్యయోః,

ఔచిత్యమ్-॥న॥ ఇది సత్యమునకును, యోగ్యమునకును పేరు.

స్యా ద్బ్రాహ్మణ్యం బ్రాహ్మణానాం భావసంహతికర్మసు. ౩౨౮

బ్రాహ్మణ్యమ్-॥న॥ ఇది బ్రాహ్మణులయొక్క భావమునకును, వారిసమూహమునకును, వారికర్మకును పేరు.

స్యా ద్ధిరణ్యం హేమ్ని కుప్యే విత్తమాన విశేష యోః, వరాటరేతసో శ్చా

హిరణ్యమ్-॥న॥ ఇది బంగారమునకును, వెండి బంగారముల కంటె నితరమైనలోహజాతికిని, ధనమునకును, కొలతభేదమునకును, గవ్వకును, రేతస్సునకును పేరు.

థ మలయః పర్వతాన్తరే. ౩౨౯. పర్వతాంశే ఽప్యుద్యానే మలయం మలయా త్రివృత్,

మలయః-ఇది పర్వతవిశేషమునకును, పర్వతమునందొకభాగమునకు పేరైనపుడు ॥పు॥ ఉద్యానమునకు పేరైనపుడు ॥న॥ తెల్లతెగడకుఁ బేరైనపుడు ॥స్త్రీ॥

సైన్ధవే తాలపర్ణ్యాం చ శైలేయం భ్రమరే పుమాన్ ౩౩౦

శైలేయమ్-ఇది లవణభేదమునకును మురయనుగ్రంథ్యద్రవ్యమునకును పేరగునపుడు ॥న॥ తుమ్మెదకు పేరయినపుడు ॥పు॥

విజయా పార్వతీ తిథ్యో ర్విజయో జయపార్థయోః,

విజయా-ఇది పార్వతికిని, తిథిభేదమునకును పేరయినపుడు ॥స్త్రీ॥ జయమునకును, అర్జునునకును పేరయినపుడు ॥పు॥

అభయం నలదే స్త్రీ తు న

[illegible]

ధ్యాయాం నిర్భయే త్రిషు.
కశేరు హేమ్నో ర్గాఙ్గే
యం గాఙ్గేయో, గుహాభీ
ష్మయోః,

జేరైనపుడు ॥సీ॥ భయములేనిదానికి పేరగునపుడు ॥త్రి॥

గాంగేయమ్-ఇది తామరకలువ మొదలైనవానిదుంపలకును, బంగారమునకును పేరైనపుడు ॥న॥ కుమారస్వామికిని, భీష్మాచార్యులకును పేరైనపుడు ॥పు॥

అస్త్రీ కషాయో నిర్యా
సే సౌరభే రసనాగయోః
33౭. క్వాథే విలేపనేచా
పి ద్రవ్యే స్యా ద్దేష వా
చ్యవత్,

కషాయః - ॥పు॥ ఇది బంకకును, పరిమళించుదానికిని, వగరునకును, సీసమునకును, కషాయమునకును, మైపూఁతకును పేరు. ద్రవ్యవిశేషమునకు పేరగునపుడు విశేష్యలింగము.

ద్వితీయా సహధర్మి
ణ్యాం ద్వితీయం పూరణే
త్రిషు. 333

ద్వితీయా - ఇది భార్యకు పేరైనపుడు ॥సీ॥ రెండవదియను నర్థమున ॥త్రి॥

త్రి ష్వహార్య స్థిరే నా
ఽద్రౌ

ఆహార్యః-ఇది స్థిరమైనదానికి పేరైనపుడు ॥త్రి॥ పర్వతమునకు పేరైనపుడు ॥పు॥

నాదేయీ జలవేతసే, త
ర్కార్యాం భూమిజంబ్వాం
చ జపాయాం నాగరఙ్గకే.
33౮. నాదేయం సిన్ధులవణే
త్రిషు త్వేష నదీభవే,

నాదేయీ-ఇది నీరుప్రబ్బలికిని, తక్కిలిచెట్టునకును, సారదపుచెట్టునకును, పేరైనపుడు ॥సీ॥ ఇందుప్పునకుఁ బేరైనపుడు ॥న॥ నదియందుఁబుట్టినదానికిఁ బేరయినపుడు ॥త్రి॥

ఆతిథ్య మాతిథేయార్థే న
స్త్వయో రతిథౌ పుమాన్.

ఆతిథ్యమ్-ఇదిఅతిథులకుఁ జెందినయన్నాదులకు పేరయినపుడు ॥న॥ అతిథికి పేరైనపుడు ॥పు॥

ఇన్ద్రియే విషయ క్లీబం
త్రిలిఙ్గో విషయాన్వితే, పు
మాన్ రాజ్ఞి స్మరే చా

విషయి - ఇది చక్షురాదులకు పేరైనపుడు ॥న॥ విషయములతోఁగూడినవానికి పేరైనపుడు ॥త్రి॥ రాజునకును, మన్మథునికిని పేరయినపుడు ॥పు॥

థ పానీయం క్లీబ మమ్బు
33౯. పేయే త్రిషు

పానీయమ్ - ఇది ఉదకమునకు పేరైనపుడు ॥న॥ పానముచేయఁదగినదానికి పేరయినపుడు ॥త్రి॥

విహాయస్తు ద్వ్యో ర్నభ
స్య్వి విహగే పుమాన్,

విహాయః॥స్త్రీ॥ఇది ఆకాశమునకు పేరైనపుడు ॥న్న॥ పక్షిసామాన్యమునకు పేరైనపుడు ॥పు॥

వేశ్యా దాస్యో ర్భుజి
ష్య స్త్రీ ప్రేష్యస్వచ్ఛన్ద
యో స్త్రిషు. 33౭

భుజిష్యా-ఇది వేశ్యకును దానిసెకును పేరైనపుడు ॥సీ॥ కింకరునికిని, స్వతంత్రునికిని పేరైనపుడు ॥త్రి॥

పస్యా వ్రతచర్యాయా
స్యః ఫాల్గునే పుమాన్,

తపస్యా-ఇది వ్రతానుష్ఠానమునకు పేరగునప్పుడు ॥సీ॥ ఫాల్గున మాసమునకుఁ బేరగునప్పుడు ॥పు॥

త్రియం గరళే పార
కే క్షేత్రజేతృణే. ౩౭౮
త్స్వర్ణాన్యదేహేచ స్యా
ధ్యగదేఽపి చ,

క్షేత్రియమ్॥న॥ ఇది విషమునకును, పరస్త్రీగర్భమునఁబుట్టిన శిశువునకును, వరిమడిలోఁ బుట్టిన తృణమునకును, వైద్యము చేయఁదగిన యన్యదేహమునకును, మాన్పనశక్యమైన రోగమునకును పేరు.

సవ్యం సవ్య ఆయత్తే
కూలానుకూలయోః.

ప్రసవ్యమ్॥న॥ ఇది ప్రదక్షిణమునకును, అధీనమైనదానికిని, ప్రతికూలమునకును, అనుకూలమునకును పేరు.

న్యో వాగ్విదాతారౌ
న్యో వ్యగర్హితౌ,

వదాన్యః ॥పు॥ ఇది వక్తకును, దాతకును పేరు.

జఘన్యః ॥పు॥ ఇది కనిష్ఠునికిని, నిందింపఁబడినదానికిని నామము.

యాన్ అనుజేఽత్యల్పే
యాన్ త్సత్తమేత్యురౌ.
౩౮౦

కనీయాన్-॥న॥ ఇది తమ్మునికిని, మిక్కిలి యల్పమైనదానికిని [నామము.

వరీయాన్-॥పు॥ ఇది శ్రేష్ఠునకును, మిక్కిలి వరువైనదానికిని నామము.

ధీయాం చోఢభనేఽ
సాధా వసుమతేఽపిచ,
తీక్ష్యో ప్రతిపాల్యా

సాధీయాన్ - ॥పు॥ శ్రేష్ఠునికిని, మిక్కిలిసాధువునకును, అంగీకరింపఁబడినవానికిని నామము.

ప్రతీక్ష్యః-॥పు॥ ఇది ఎదురుచూడఁదగినవానికిని, మొదటిదానికిని నామము.

క్ష్వేతే క్షేత్రియాద
౩౮౧

క్షేత్రియాదయః=క్షేత్రియశబ్దము మొదలైన, ఏతే=ఈ యెనిమిదిశబ్దములును, త్రిషు=మూఁడులింగములయందును వర్తించును.

ఇతి యాన్తాః.

యాంతపదవర్గము ముగిసెను.

---

తశమ్భూ శబరౌ
స్కరౌ సూర్యపావకౌ,
పరౌ యుగసన్దేహౌ

శబరః ॥పు॥ ఇది కిరాతునికిని, శివునకును నామము.

భాస్కరః ॥పు॥ ఇది సూర్యునికిని, అగ్నికిని నామము.

ద్వాపరః ॥పు॥ ఇది యుగభేదమునకును, సంశయమునకును నామము.

రౌ కరిపుస్తకౌ. ౩౮౨
సుతోష్ట్రౌ దాసేరౌ
రౌ శిఖికుక్కుటౌ,
హేషే శృఙ్గారౌ

కుంజరః ॥పు॥ ఇది ఏనుఁగునకును, కెంద్రుకలకును నామము.

దాసేరః ॥పు॥ ఇది దాసీపుత్రునికిని, ఒంటెకును నామము.

విష్కిరః ॥పు॥ ఇది నెమలికిని, కోడికిని నామము.

శృంగారః ॥పు॥ ఇది రసభేదమునకును, గజాలంకారమునకును నామము.

వజ్రారా భూసుతోల్మకా.
ప్రకారా భేదసాదృశ్యే
వికారా రోగవిక్రియే,
కుమ్భీరా చోరభుజగౌ
కుటీరా కర్కటాలయౌ.
దైత్యారీ దేవగోవిన్దౌ
తిత్తిరీ మునిపక్షిణౌ,
శాఙ్కరీ స్కన్ద హేరమ్బౌ
సహూరీ వృషభాస్కరౌ.
హిమారీ వహ్నితపనౌ
జసురీ పవిపావకౌ,
ధాన్యోత్క్షేప తిరస్కారౌ నికారౌ
వథ కూర్పరః. ౩౮౭. కఫోణిజాన్వో
రాకార స్త్వాకృతౌ గాత్రవైకృతౌ,
మిహిరౌ వాయు చంద్రార్కాః
కేసరీ హరి సింహయోః.
ప్రస్తరౌ మణ్యశ్మకుథౌ
సంస్తరోఽధ్వరశయ్యయోః,
ఆకరౌ స్థానఖన్యోర్ధ్వాః
ప్రదరౌ భఙ్గకృచ్ఛ్రరాః.
౩౮౮
ప్రకరః కీర్ణ పుష్పాదౌ సంహతౌ
మకరస్త్విహ, నిధౌ యాదసి రాశౌ చ

అంగారః ॥పు॥ ఇది అంగారకునికిని, కొఱవికిని నామము
ప్రకారః ॥పు॥ ఇది భేదమునకును, సాదృశ్యమునకును పే
వికారః॥పు॥ ఇది రోగమునకును, మనోవికారమునకును పే
కుంభీరః ॥పు॥ ఇది దొంగకును, సర్పమునకును నామము.
కుటీరః ॥పు॥ ఇది ఎండ్రకాయకును, గుడిసెకును నామము
దైత్యారిః ॥పు॥ ఇది దేవతలకును, విష్ణువునకును నామము
తిత్తిరిః ॥పు॥ తిత్తిరియనుమునికిని, తీతువుపక్షికిని నామము
శాంకరిః ॥పు॥ ఇది కుమారస్వామికిని, విఘ్నేశ్వరునికి మఱియు నుమకును నామము.

సహూరిః ॥పు॥ ఎద్దునకును, సూర్యునికిని నామము.
హిమారిః ॥పు॥ ఇది అగ్నికిని, సూర్యునికిని నామము.
జసురిః ॥పు॥ ఇది వజ్రాయుధమునకును, అగ్నికిని నామము
నికారః ॥పు॥ ఇది ధాన్యముతూర్పుపట్టుటకును, తిరస్కారమునకును నామము.

కూర్పరః ॥పు॥ ఇది మోఁచేతిమొనకును, కాలిపిక్కకును నామము.

ఆకారః ॥పు॥ ఇది స్వరూపమునకును, శరీరవికారమునకును నామము.

మిహిరః ॥పు॥ ఇది వాయువునకును, చంద్రునికిని, సూర్యునికిని నామము.

కేసరీ ॥న్-ప్ర ఇది విష్ణువునకును నామము.
ప్రస్తరః ॥పు॥ ఇది మణికిని, శిలకును, ఏనుఁగుమీఁదఁబఱచెడు రత్నకంబళినికి నామము.

సంస్తరః ॥పు॥ ఇది యాగమునకును, పాన్పునకును పేరు.
[గనికిని, కూటమికిని నామము
ఆకరః ॥పు॥ ఇది స్థానమునకును, లోహరత్నాదులు పుట్టు
ప్రదరః ॥పు॥ ఇది విఱుగుటకును, స్త్రీరక్తస్రావవ్యాధికిని బాణమునకును, నామము.

ప్రకరః ॥పు॥ ఇది వెదజల్లిన పుష్పాదులకును, సమూహమునకును నామము.

మకరః ॥పు॥ ఇది నిధిభేదమునకును, మొసలికిని, రాశిభేదమునకును నామము.

చజ్కరస్తు ద్రుమే రథే.
కింశారు స్సస్యశూకే స్యా
స్సియకే కజ్కపక్షిణి,
విష్టరః కుశముష్టౌ స్యా
త్తాద్యాసనవృక్షయోః.
ఖపురో లశునే పూగవృ
. నిర్యాసపూగయోః,
కపోలే చ కటాహే చ భై
. పాత్రే చ కర్పరః. 3౹౹౧
మందారః పారిభద్రే౽
ర్కపర్ణే కల్పమహీరుహే,
గాంధారస్తు స్వరే రాగే
శ సిన్దూరయో
రథ. కులాలదణ్డే ముకురో
ర్పణాదర్శయో రపి,
ఆధార ఆలవాలామ్బు బ
౽ధికరణే౽పిచ. 3౹౹3

స్యా దాసారో మిత్ర
లే వేగవృష్టిప్రసారయోః,
కేదార శ్శృజ్కరక్షేత్రే
లభేదాలవాలయోః.
మయూరో బర్హిచూడా
రూ మహామార్గే శిఖావళే,
నరేన్ద్రో విషవైద్యే౽పి
మహేన్ద్రః పతిశక్రయోః.
ఆశిరః క్షీరవికృతౌ భో
నే పావకే రవౌ,
వికిరో వాలుకానామం చ
విహార స్సుగతాలయే.
౹౹౬. క్రీడానామం చా
థ సంస్కార స్సంకల్ప

చంకురః-౹౹పు౹౹ ఇది వృక్షవిశేషమునకును, రథమునకును పేరు.

కింశారుః-౹౹పు౹౹ ఇది వరిముంటికిని, బాణమునకును, పెద్దగ్రద్ద కును నామము.

విష్టరః - ౹౹పు౹౹ ఇది దర్భపిడికిని, పీట మొదలైన యాసనములకును, వృక్షమునకును నామము.

ఖపురః-౹౹పు౹౹ ఇది వెల్లుల్లికిని, పోఁకచెట్టునకును, బంకకును పోఁకకును నామము.

కర్పరః-౹౹పు౹౹ ఇది చెక్కిలికిని, తొట్టికిని, భిక్షాపాత్రకును నామము.

మందారః-౹౹పు౹౹ ఇది పారిజాతపుచెట్టునకును, జిల్లేడుచెట్టునకును, కల్పవృక్షమునకును నామము.

గాంధారః-౹౹పు౹౹ ఇది స్వరభేదమునకును, రాగవిశేషమునకును, దేశభేదమునకును, సిందూరమునకును నామము.

ముకురః - ౹౹పు౹౹ ఇది కుమ్మరసానం ద్రిప్పుదండమునకును, వణిదర్పణమునకును, అద్దమునకును నామము.

ఆధారః-౹౹పు౹౹ ఇది పాదులయందు కట్టకట్టి నీళ్లునిలుపఁగల ప్రదేశమునకును, ఒకవస్తువునుంచెడు స్థలము మొదలైనయాధా ములకును పేరు.

ఆసారః - ౹౹పు౹౹ ఇది స్నేహితబలమునకును, వేగమునకును వర్షధారాపతనమునకును పేరు.

కేదారః-౹౹పు౹౹ ఇది శివక్షేత్రమునకును, పర్వతవిశేషమునకును, మడికాలువకును పేరు.

మయూరః-౹౹పు౹౹ ఇది నెమలి శిరస్సునకును, ఉత్తరేణిచెట్టునకును, నెమలికిని పేరు. [తికిని పేరు

నరేంద్రః-౹౹పు౹౹ ఇది విషవైద్యునికిని, అపిశబ్దమువలన భూ

మహేంద్రః-౹౹పు౹౹ ఇది ప్రభువునకును, ఇంద్రునికిని పేరు.

ఆశిరః-౹౹పు౹౹ ఇది క్షీరవికారమునకును, భోజనమునకును, గ్నికిని, సూర్యునికిని పేరు. [పేరు

వికిరః-౹౹పు౹౹ ఇది ఇసుకకును, చకారమువలన చల్లుటకును

విహారః-౹౹పు౹౹ ఇది బౌద్ధాలయమునకును, క్రీడకును పేరు.

సంస్కారః-౹౹పు౹౹ ఇది సంకల్పమునకును, స్వభావముగనున

ప్రతియత్నయోః,
శర్కరా తు గుడే రోగ
భేదే శర్కరిలస్థలే. ౩౪౭.
శిలాభేదే సితాయాం చ శ
కలాల్పకపాలయోః,
గాయత్రీ ఖదిర శ్ఛన్దః
కృపాణ్యా మపి కర్తరీ.
సా సైరన్ధ్రీ యాఽన్యగృ
హే స్వాయత్తా శిల్పకారి
ణీ, వర్ణసఙ్కరజాయా చ
కాఞ్చ్యాం ఛన్దసి శక్వరీ.
ఛత్రప్రాన్తాలమ్బి వస్త్రే
కేశే వాద్యే చ ఝుల్లరీ,
ఉర్వరా సర్వసస్యాఢ్య
భూమౌ భూమాత్ర కేఽపిచ.
శైలవృక్షాగ్రయోః కో
ట్యాం కక్ష్యాయాం శిఖ
రం మతమ్,
కుహరం గహ్వరే ఛిద్రే
మన్దిరం నగరే గృహే.
ధ్వాన్తేఽక్షిరోగే తిమిర
మమ్బరం వ్యోమ్ని వాససి
ఔశీర శ్చామరే దణ్డే
కటిత్రం కటివాససి. ౩౫౧
మేఖలాయాం
గుహాదమ్భ గహనేషు తు
గహ్వరమ్,
కటీరం కన్దరే కట్యాం
విషయే ఽఙ్గే ఽఙ్గణే
ఽజిరమ్. ౩౫౩
పుష్కర మమ్బుని ఖే భే

వస్తువులో గుణోత్కర్షము కలుగఁజేయుంటకును పేరు.
శర్కరా - ॥స్త్రీ॥ ఇది బెల్లమునకును, రోగవిశేషమునకు
మొరముగలభూమికిని, పాషాణభేదమునకును, చక్కెరకును,
నుకకును, చిల్లపెంకునకును పేరు.
[ను పే
గాయత్రీ-॥స్త్రీ॥ ఇది చండ్రచెట్టునకును, ఛందోభేదము
కర్తరీ-॥స్త్రీ॥ ఇది పెద్దకత్తికిని, అపశబ్దమువలనకత్తెరకును పే
సైరంధ్రీ-॥స్త్రీ॥ ఇది ఏస్త్రీ యన్యులగృహమునందు వసించు
స్వతంత్రురాలై స్త్రీల నలంకరించుచున్నదో యా స్త్రీకిని, బసిక
నున్న స్త్రీకిని పేరు.
శక్వరీ-॥స్త్రీ॥ ఇది మొలనూలికిని, ఛందోభేదమునకును పే
ఝుల్లరీ - ॥స్త్రీ॥ ఇది గొడుగుచుట్టువ్రేలవేసిన వస్త్రవిశేషమ
కును, వెండ్రుకలకును, వాద్యవిశేషమునకును పేరు.
ఉర్వరా-॥స్త్రీ॥ ఇది సకలమైన పైర్లతోఁగూడిన భూమికి
భూమాత్రమునకును పేరు.
శిఖరమ్-॥న॥ ఇది పర్వతముయొక్క తుదకును, వృక్షాగ్ర
నకును, అంచునకును, మేడలతొట్టికట్టుటకును పేరు.
కుహరమ్-॥న॥ ఇది గుహకును, రంధ్రమునకును పేరు.
మందిరమ్-॥న॥ ఇది పత్తనమునకును గృహమునకును పే
తిమిరమ్-॥న॥ ఇది గాఢాంధకారమునకును, నేత్రరోగమ
కును పేరు.
అంబరమ్-॥న॥ ఇది ఆకాశమునకును, వస్త్రమునకును పేరు
ఔశీరః-॥పు॥ ఇది చామరమునకును, కఱ్ఱకును పేరు.
కటిత్రమ్-॥న॥ ఇది మొలయందలి వస్త్రములకును, మొలను
లికిని పేరు.
గహ్వరమ్-॥న॥ ఇది గుహకును, కపటమునకును, చొరఁగు
డనిదానికిని పేరు.
కటీరమ్-॥న॥ ఇది గుహకును, పిఱుఁదులకును పేరు.
అజిరమ్-॥న॥ ఇది శబ్దాదివిషయములకును, శరీరమునకును
ముంగిలికిని పేరు.
పుష్కరమ్-॥న॥ ఇది ఉదకమునకును, ఆకాశమునకును,నక్ష

యుంధి వాద్యముఖే మదే
ఽపి ధారాయామ్, ద్వీపే
భేషజభేదే సారసతీర్థాహి
కరికరాగ్రేషు. ౩౬౮

దధికలశ గోమయామ్బుషు
కుశతామ్ర బ్రహ్మసూత్ర మ
న్త్రేషు, హేమ్న్యర్థే చ
పవిత్రం త్రిషు పూతే పుం
సి శమ్భుపావకయోః. ౩౬౯

కర్బురం హేమ్ని వ్యఘే
తోయే దైత్యే నా శబలే
త్రిషు,

జర్ఝరో నాపి తే శక్రధ్వ
జేఽక్షీర్ణే తు వాచ్యవత్.
౩౬౬

దర్దురో నావి భేకే చ త్రి
ష్వీషద్భుగ్నవస్తుని,

కఞ్జరం కనకే క్లీబం పీతే
త్రిషు హయే పుమాన్.

గ్రీవాయాం కన్ధరా మే
ఘే పుమాన్

దేవేఽపి నిర్జరాః,

శార్వరం తమసి క్లీబం
హింస్రే త్రిష్వేషనా విధా.

నిశిథిన్యాం హారిద్రాయాం
సన్ధ్యాయాం చాఽపి శర్వరీ,

స్థణ్డిలాఙ్గణయోః క్లీబం చ
త్వరం నా చతుష్పథే.
౩౬౭

క్రియాకారప్రతిజ్ఞాపద్యు
ద్ధార్థే పుంసి సఙ్గరః,

త్రమునకును, యుద్ధమునకును, మద్దెల మొదలైన వాద్యములముఖమునకును, మదమునకును, కత్తివాదరకును, ద్వీపభేదమునకును, ఔషధవిశేషమునకును, కమలమునకును, తీర్థవిశేషమునకును, సర్పమునకును, ఏనుఁగుతొండముయొక్క కొనకును పేరు.

పవిత్రమ్-ఇది పెరుగుకడవకును, గోమయమునకును, ఉదకమునకును, దర్భకును, రాగికిని, బ్రహ్మసూత్రమునకును, మంత్రమునకును, బంగారమునకును, ధనమునకును, పేరగునపుడు ॥న॥ పరిశుద్ధమైనదానికి పేరగునపుడు ॥త్రి॥ శివునికిని, అగ్నికిని పేరగునపుడు ॥పు॥

కర్బురమ్-ఇది బంగారమునకును, ఉదకమునకును, పాపమునకును పేరగునపుడు ॥న॥ రాక్షసునికి పేరగునపుడు ॥పు॥ చిత్రవర్ణముకలదానికి పేరగునపుడు ॥త్రి॥

జర్ఝరః - ఇది ముంగలవానికిని, ఇంద్రధ్వజమునకు పేరగనపుడు ॥పు॥ ఒకటితోనొకటి కలియనిదానికి పేరగునపుడ ॥విశేష్యలింగము॥

దర్దురః-ఇది తెప్పకును, కప్పకును పేరగునపుడు ॥పు॥ ఇచుకవంగినదానికి పేరగునపుడు ॥త్రి॥

కంజరమ్-ఇది బంగారమునకు పేరగునపుడు ॥న॥ పచ్చనిదానికి పేరగునపుడు ॥త్రి॥ గుఱ్ఱమునకు పేరగునపుడు ॥పు॥

కంధరా-ఇది కంఠమునకు పేరగునపుడు ॥స్త్రీ॥ మేఘమునకు పేరగునపుడు ॥పు॥

నిర్జరః-ఇది దేవతలకు పేరగునపుడు ॥పు॥ అపిశబ్దమువలన ముసలితనములేనివారికి పేరగునపుడు ॥త్రి॥

శార్వరమ్-ఇది చీఁకటికి పేరగునపుడు ॥న॥ ఘాతుకునకు పేరగునపుడు ॥త్రి॥ చంద్రునికి పేరగునపుడు ॥పు॥

శర్వరీ-ఇది రాత్రికిని, పసుపునకును, సంధ్యాకాలమునకును పేరు.

చత్వరమ్-ఇది అగ్నిహోత్రము నుంచుటకొఱకు సంస్కారము చేయఁబడినస్థలమునకును, ముంగిలికిని పేరగునపుడు॥న॥ నలుగుతెరువులుగూడిన ప్రదేశమునకు పేరగునపుడు ॥పు॥

సంగరః-ఇది క్రియానిశ్చయమునకును, ప్రతిజ్ఞకును, ఆపదకును, యుద్ధమునకు పేరగునపుడు ॥పు॥ జమ్మిపండునకు

క్లీబే శమీఫలే
పాన్థ స్త్విత్వరః కుల
టేత్వరీ. ౩౭౦
శాక్వరో నా వృషే క్లీ
బం ఛన్దోభేదే౽
థ నాగరమ్, ముస్తాశుం
ఠ్యో స్త్రీషు త్వేష విదగ్ధ
నగరోద్భవే. ౩౭౧
ప్రభౌ త్రి ష్వీశ్వర శ్శ
మ్భౌ నా
గౌర్యా మీశ్వ రేశ్వరీ,
కాంతారో౽స్త్రీ వనేదు
ర్వర్త్మ న్యఙ్ఘ్రా న్తరే తు నా.
కుమారో మాసుతే స్క-
న్దే యువరాజే౽శ్వవాచ
కే, బాలే వరణవృక్షే చ నా
రూపే తు నపుంసకమ్ ౩౭౩
కుమారీ తు సహా గౌరీ క
న్యకా నవమాలికా,
ఓష్ఠే పుం స్యధరో౽ధ
హీనే చ త్రిష్వ
మరా. ౩౭౪. స్థూణా
మా చీన్ద్రపురీ దూర్వా
స్త్రీ సురే పుమాన్,
న్తరః పరిధానీయ స్త్వే
బాహ్యేషు వాచ్యవ
౩౭౫. అన్తరాత్మని
స్త్యేష వినార్థే౽వ్యయ
రా, అన్తరం వివరా
భేదే ష్వవధి మధ్య
ః. ౩౭౬. అవకాశా
మో స్తాదర్థ్యే న్యా

గునపుడు ॥న॥

ఇత్వరః-ఇది మార్గమునడుచువానికి పేరగునపుడు ॥పు॥ రం కులాడికి పేరగునపుడు-ఇత్వరీ ॥స్త్రీ॥

శాక్వరః-ఇది వృషభమునకు పేరగునపుడు ॥పు॥ ఛందస్సునకు పేరగునపుడు ॥న॥

నాగరమ్-ఇది భద్రముస్తలకును, శొంఠికిని పేరగునపుడు ॥న॥ చాతుర్యవంతునికిని, పట్టణమునం బుట్టినదానికిని పేరగునపుడు ॥త్రి॥

ఈశ్వరః-ఇది నిగ్రహానుగ్రహాసమర్థులకును, మఱియుం ప్రభువునకును పేరగునపుడు ॥త్రి॥ శివునికి పేరగునపుడు ॥పు॥

ఈశ్వరా-ఈశ్వరీ ॥స్త్రీ॥ ఈరెండును గౌరికి పేళ్లు.

కాంతారః-ఇది అడవికిని, చొరగూడనిమార్గమునకును పేరగునపుడు ॥పు॥ బండికంటినడుమునకు పేరగునపుడు ॥పు॥

కుమారః-ఇది మన్మథునికిని, కుమారస్వామికిని, యువరాజునకును, గుఱ్ఱమునకును, బాలునికిని, ఉలిమిరిచెట్టునకును పేరగునపుడు ॥పు॥ కుమారద్వీపమునకు పేరగునపుడు ॥న॥

కుమారీ ॥స్త్రీ॥ ఇది పిన్నగోరింటకును, గౌరికిని, కన్యకకును, విరజాజికిని పేరు.

అధరః-ఇది పెదవికి పేరగునపుడు ॥పు॥ దిగువనున్నవస్తువునకును, హీనునికిని పేరగునపుడు ॥త్రి॥

అమరా-ఇది స్తంభమునకును, తిప్పతీంగెకును, ఇంద్రుని పురమునకును గరికెకును బేరగునపుడు ॥స్త్రీ॥ దేవతలకు పేరగునపుడు ॥పు॥

అంతరః-ఇది కట్టుకోకకును, తనసంబంధమైన దానికిని, వెలుపలికిని పేరగునపుడు విశేష్యలింగము. పరమాత్మకు పేరగునపుడు ॥పు॥ ఆది పెలిగా నను వినార్థమునందు అంతరా అని యవ్యయము, రంధ్రమునకును, మఱుగుపుటకును, విశేషమునకును, మర్యాదకును, మధ్యప్రదేశమునకును, ఎడమునకును, అవసరమునకును, దానికొఱకనునర్థమునకును, మఱియొకటి యనునర్థమునకును పేరగునపుడు ॥న॥

యోరపి,
ప్రతివా చ్యుత్తరం నా
। విరాటతనయే త్రిషు.
౨౭. కాలో దీ చ్యుత్త
యూర్ధ్వేషు తారాభేదే దిశి
్త్రియాం,
అక్షరం ప్రణవే ధర్మే ప్ర
్రతౌ తపసి క్రతౌ. ౩౭౦
ర్ణే మోక్షే చ నా త్వేష
వవిష్ణువిరిఞ్చిషు,
మృగ దానవ శాద్ధేషు శ
బర శ్శమ్బరీ వృషా. ౩౭౯
జే వ్రతామ్బువిత్తేషు

సుషిర స్త్వనలే పుమాన్,
్రషు రంధ్రాన్వితే క్లీబే
ద్రవంశాది వాద్యయోః.
క్లీబం లోహే పుమాన్
ోమే కవాటార్థే ఽరరం
నా,
కరీరో నా ఘటే వృక్షే
స్త్రియాం వైణవాఙ్కురే.
మత్సరో ఽన్యోదయద్వే
్ష తద్వ త్కృపణయో
్త్రషు.
అసృక్కుఙ్కుమయోః క్లీ
ంరుధిరంభూసుతేపుమాన్.
మధురో నా రసే తద్వ
్వన్తరసాస్వాదుషు త్రిషు,
ధురా శతపుష్పా చ

ఉత్తరమ్ - ఇది ప్రత్యుత్తరమునకు పేరగునపుడు ॥న॥ విరాటుని పుత్రునికి పేరగునపుడు ॥పు॥ కాలవిశేషమునకును, ఉత్తర దేశము మొదలైనదానికిని, శ్రేష్ఠునికిని, మీఁదనున్న దానికిని పేరగునపుడు ॥త్రి॥ నక్షత్రమునకును, ఉత్తరదిక్కునకును పేరగునపుడు ॥స్త్రీ॥

అక్షరమ్-ఇది ఓంకారమునకును, ప్రకృతికిని, తపస్సునకును, యాగమునకును, అకారాదివర్ణములకును, మోక్షమునకును పేరగునపుడు ॥న॥ శివునికిని, విష్ణువునకును, బ్రహ్మకును. పేరగునపుడు ॥పు॥

శంబరమ్-ఇది మృగవిశేషమునకును, రాక్షసునికిని, శాద్ధునికిని పేరగునపుడు ॥పు॥ ఎలికచెవికూరకు పేరగునపుడు, శంబరీ ॥స్త్రీ॥ వ్రతవిశేషమునకును, ఉదకమునకును, ధనమునకును పేరగునపుడు ॥న॥

సుషిరః - ఇది అగ్నికి పేరగునపుడు ॥పు॥ రంధ్రముగల దానికి పేరగునపుడు ॥త్రి॥ రంధ్రమునకును, పిల్లనగ్రోవి మొదలైనవాద్యములకును పేరగునపుడు ॥న॥

అరరమ్ - ఇది లోహమునకు పేరగునపుడు ॥న॥ చంద్రునికి పేరగునపుడు ॥పు॥ తలుపునకు పేరగునపుడు ॥స్త్రీ॥

కరీరః - ఇది ఘటమునకును, వెణుతురుచెట్టునకును పేరగునపుడు ॥పు॥ వెదురుమొలకకు పేరగునపుడు ॥స్త్రీ॥

మత్సరః - ఇది పరుల సంపదయందలి ద్వేషమునకు పేరగునపుడు ॥పు॥ ఆద్వేషముగల వానికిని, ఇంచుక లాభమునకై సకలావమానములను సహించువానికిని బేరగునపుడు ॥త్రి॥

రుధిరమ్-ఇది నెత్తురునకును, కుంకుమకును బేరగునపుడు ॥న॥ అంగారకునికిఁ బేరగునపుడు ॥పు॥

మధురః - ఇది రసభేదమునకుఁ బేరగునపుడు ॥పు॥ మధురరసముగల దానికిని, ఒప్పిదమైన దానికిని, రుచిగలదానికిని బేరగునపుడు ॥త్రి॥ అడవిసదాపకును, చకారమువలన మధురాపురమునకును బేరగునపుడు ॥స్త్రీ॥

ఋతే నా
జఠరం క్లీబ ముదరే కఠినే త్రిషు,
ధూసరో వర్ణఖరయో రీషత్పాణ్డౌ తు వాచ్యవత్.
సింహాశ్వయోశ్చ కేశేషు కిఞ్జల్కే కేసరోఽస్త్రియాం,
నాగకేసర పున్నాగ వకుళేషు పుమా నయమ్. 3౮౫

మునకుఁ జేరగునపుడు ॥పు॥

జఠరమ్ - ఇది ఉదరమునకుఁ జేరగునపుడు ॥న॥ కఠినమై దానికిఁ జేరగునపుడు ॥త్రి॥

ధూసరః - ఇది వర్ణవిశేషమునకును, గాడిదెకును జేరినపు ॥పు॥ కొంచెము తెల్పుగలదానికిఁ జేరినపుడు విశేష్యలింగమ

కేసరః - ఇది సింహము, గుఱ్ఱము వీనియొక్క మెడవెండ్ర కలకును, ఆకరుపువ్వులకును జేరినపుడు ॥పు॥ నాగకేస మునకును, సురపొన్నకును, అశోకవృక్షమునకును జేరగునపు ॥పు॥

సాముద్రం లవణాదౌ త్రిష్వయం క్లీబేఽఙ్గలక్షణే,
ధ్వాన్తరాత్రౌ చ రాత్రౌ చ తమిస్రాతిమిరే నసా.
చికురోఽహౌ గేహబభ్రౌ కేశే త్రిషు తు చఞ్చలే,
హిమశీకరయోః పుంసి తుషార శ్శీతలే త్రిషు. 3౮౬
చమరో నా మృగే క్లీబం చామరేఽ
థ త్రిషూత్తరే,

సాముద్రమ్-ఇది సముద్రమునఁబుట్టిన యుప్పు మొదలయి వానికిఁ జేరినపుడు ॥త్రి॥ అంగలక్షణములకుఁ జేరినపుడు ॥

తమిస్రా - ఇది చీఁకటిగల రాత్రికిని, సామాన్యరాత్రికి జేరినపుడు ॥స్త్రీ॥ చీఁకటికిఁ జేరగునపుడు ॥న॥

చికురః - ఇది సర్పమునకును, బల్లికిని, తలవెండ్రుకలకు జేరినపుడు ॥పు॥ చంచలమైనదానికిఁ జేరినపుడు ॥త్రి॥

తుషారః - ఇది మంచునకును, తుంపరలకును జేరగునపు ॥పు॥ చల్లనిదానికిఁ జేరగునపుడు ॥త్రి॥

చమరః - ఇది సవరపు మృగమునకుఁ జేరగునపుడు ॥పు॥ వింజామరకుఁ జేరగునపుడు ॥న॥

అథ = ఈశబ్దమునకుఁ బిమ్మట, ఉత్తరే = మీఁదజెప్పఁగ శబ్దములన్నియుం, అనఁగా నుదారశబ్దము మొదలుకొని యిత శబ్దమువఱకుగల యేనిమిదిశబ్దములు, త్రిషు = మూఁడులిం ములయందును వర్తించును.

ఉదారో దక్షిణే ఖ్యాతే దానశౌణ్డే మహత్యపి.
కాలేఽప్యశృఙ్గో గౌశ్శ్మశ్రురహితో నా చ తూబరః,
ధీరైకతానా వేకాగ్రౌ భఙ్గురా వక్రనశ్వరౌ.
3౮౭
విధురౌ కష్టవిశ్లిష్టౌ వఙ్కనీచౌ తు పామరౌ,

ఉదారః - ॥పు॥ ఇది నేర్పరికిని, ప్రసిద్ధికిని, దానశీలునికిని దొడ్డవానికిని జేరు.

తూబరః - ॥పు॥ ఇది కాలమున గొమ్ములురాని యెద్దునకును గడ్డము మీసములు రాని బేడివానికిని జేరు.

ఏకాగ్రః - ॥పు॥ ఇది ధీరునికిని, ఏకాగ్రచిత్తునకును జేరు

భంగురః - ॥పు॥ ఇది వక్రమైనదానికిని, నశించు స్వభావము గలదానికిని జేరు. [కును జేరు

విధురః-॥పు॥ ఇది కష్టమును బొందినవానికిని, యోగవంతు

పామరః-॥పు॥ ఇది మూఢునికిని, నీచునకును జేరు.

చతురౌ దక్షధీమన్తౌ
ఇతరౌ వన్యపామరౌ.

ఇతి రేఫాన్తాః.

---

ఉల్లోలహర్షౌ కల్లోలౌ
దేహాత్మానౌ తు ముద్గలౌ,
కున్తలౌ దేశచికురౌ
సృగాలౌ దైత్యజమ్బుకౌ.
కోకిలౌ వుల్ముకపికౌ
జమ్బాలౌ పఙ్కశైవలౌ,
సర్పభేదే చ దుత్తూరే మా
తృభ్రాతరి మాతులః. ౩౯౭

జగలః క్షిప్తదుగ్ధే స్యా
త్కితవేఽపి చ మోదకే,
కుమ్భిల స్తస్కరే నక్రే
పథి చ్ఛాయాహరేఽపి సః.
కాకోలస్తు ద్రోణకాకే వి
షభేద కులాలయోః,
శార్దూలౌ దానవే వ్యా
ఘ్రే శ్రేష్ఠేతూత్తరతస్థితః.
వఞ్జుళ స్తిక్తకాశోక వేత
సే ష్వ

థ మేఖలా, కాఞ్చ్యాం
దా మ్న్యద్రికటకే శ్రోణి
స్థానాసిబన్ధయోః, ౩౯౮
శృఙ్ఖలం పుంస్కటీ వస్త్ర
బన్ధేఽపి

కదళీ మృగే, రంభాయాం

చతురః - ॥పు॥ ఇది సమర్థునికిని, బుద్ధిమంతునకును పేరు.

ఇతరః - ॥పు॥ ఇది అన్యునకును, వివేకహీనునకును పేరు.

రేఫాంతపదవర్గము ముగిసెను.

---

కల్లోలః-॥పు॥ఇది గొప్పకెరుళ్లకును, సంతోషమునకును పేరు.

ముద్గలః - ॥పు॥ ఇది దేహమునకును, ఆత్మకును పేరు.

కుంతలః-॥పు॥ఇది దేశభేదమునకును, తలవెండ్రుకలకును పేరు.

సృగాలః - ॥పు॥ ఇది దైత్యునికిని, నక్కకును పేరు.

కోకిలః - ॥పు॥ ఇది కొఱవికిని, కోకిలపక్షికిని పేరు.

జంబాలః - ॥పు॥ ఇది అడుసునకును, పాచికిని పేరు.

మాతులః - ॥పు॥ ఇది పొడమైనదేహమును, తోకయందు గలిగి నాలుగుపాదములతో నుమ్మెత్తలతో సంచరించు ముజ్జి పామునకును, ఉమ్మెత్తచెట్టునకును, మేనమామకును, చకారమువలన మాదీఫలపు చెట్టునకును పేరు.

జగలః - ఇది పిండిపాలకును, జూదగానికిని, మోదకమను భక్ష్యవిశేషమునకును పేరు.

కుంభీలః-ఇది దొంగకును, మొసలికిని, మార్గమున ఛాయను గ్రహించి మార్గస్థుల హింసించు భూతమునకును పేరు.

కాకోలః - ॥పు॥ ఇది మాలకాకికిని, విషవిశేషమునకును కుమ్మరవానికిని పేరు.

శార్దూలః - ॥పు॥ ఇది రాక్షసునికిని, పెద్దపులికిని, ఉత్తరపదమయినపుడు శ్రేష్ఠునకును పేరు.

వంజుళః-॥పు॥ ఇది గుమ్మిచెట్టునకును, అశోకవృక్షమునకును ప్రబ్బలిచెట్టునకును పేరు.

మేఖలా - ॥స్త్రీ॥ ఇది మొలనూలికిని, పలుపునకును, కొండనడుమునకును, పిఱుదుల ప్రదేశమునకును, కత్తి చిలకట్రాకిని పేరు.

శృంఖలమ్-॥త్రి॥ ఇది మొగవాని కట్టువస్త్రమును బిగించెత్రాడు మొదలయినవానికిని, అపిశబ్దమువలన బంధసాధనమైన గొలుసులు మొదలైనవానికిని పేరు.

కదళీ-॥స్త్రీ॥ఇదిబొల్లిచాయ మెడచాఱలుగలిగినబిలములోనుం

మహిళా భీరుగన్ద్ర్యోః ౩౯౬
మహిళా - ॥స్త్రీ॥ ఇది భయముగల స్త్రీకిని, ప్రేంకణపు చె
నకును పేరు.

వృషల్యృతుమతీ వంధ్యా శూద్రాకన్యా మృతప్రజా,
వృషలీ - ॥స్త్రీ॥ ఇది అంటువీడిన స్త్రీకిని, గొడ్రాలికిని, శూ
కన్యకును, చచ్చినబిడ్డలగన్న స్త్రీకిని పేరు.

శకలం వల్కలే ఖణ్డే
శకలమ్ - ॥న॥ ఇది నారచీరకును, తునుకకును పేరు.

పలలం మాంసపంకయోః. ౩౯౭ తిలచూర్ణే
పలలమ్ - ॥న॥ ఇది మాంసమునకును, అడుసునకును, నువ
పిండికిని పేరు.

థ పటలం బృన్దే ఛదిషి నృగ్గుజే,
పటలమ్-ఇది సమూహమునకును పేరైనపుడు ॥పు॥ ఇ
కప్పునకును, నేత్రరోగమునకును పేరైనపుడు ॥న॥

కువలం బదరే ముక్తాఫలే కువలయేఽపి చ. ౩౯౮
కువలమ్-॥న॥ ఇది రేగుబండునకును, ముత్యమునకును, క
వకును పేరు.

నాబిలం నాభిఖణ్డే చ వంశణే చోత్తమస్త్రియామ్,
నాబిలమ్ - ఇది కస్తూరిఖండమునకును, గజ్జకును, ఉత్త
స్త్రీకిని పేరు. [...]లోకమునకును పే

పాతాళం బాడబాగ్నౌ చ
పాతాళమ్ - ॥న॥ ఇది బడబాగ్నికిని, చకారమువలన నా

కీలాల మసృగమ్బునోః. ౩౯౯. ఫణభాగే
కీలాలమ్ - ॥న॥ ఇది నెత్తురునకును, ఉదకమునకును, పా
పడిగెయొక్క భాగమునకును పేరు.

దుకూలం తు క్షౌమే సూక్ష్మాంశుకేచ తత్,
దుకూలమ్ - ॥న॥ ఇది వెలిపట్టుచీరకును, సన్నపు వలువకు
పేరు.

లాఙ్గూలం మేహనే పుచ్ఛే
లాంగూలమ్ - ॥న॥ శిశ్నమునకును, తోకకును పేరు.

శమలం శకృ జ్జేనసోః.
శమలమ్-॥న॥ ఇది అమేధ్యమునకును, పాపమునకును పే

కమలం ఛురికాదీనాం హేమాద్యై శ్చిత్రితాజినే, [...] మ్నా వృషధేఽరుణాబ్దే [...]పి కమలా శ్రీ వరస్త్రియోః. ౪౦౦
కమలమ్-ఇది చురకత్తి మొదలైనవానికిని, బంగారుచిత్త
పుతోఁ జేయఁబడిన తోలుఒరకును, కడుపులోని నీరుతిత్తికి
ఔషధవిశేషమునకును, ఎఱ్ఱదామరపువ్వునకును పేరగునపు
॥న॥ లక్ష్మీదేవికిని, ఉత్తమస్త్రీకిని పేరగునపుడు ॥స్త్రీ॥

కుకూలం శఙ్కు సంకీర్ణే [...]భ్రే పుంసి తుషానలే,
కుకూలమ్ - ఇది మేకులునాటిన గుంటకు పేరగునపుడు ॥
కుమ్మునకు పేరగునపుడు ॥పు॥

వాతూలః [...] మసి వాతూ స్సతు వాతాసహే త్రి[...]. ౪౦౧
వాతూలః - ఇది వాయుసమూహమునకును, అపిశబ్దమువల
వాతూలాగమునకును, ఉన్మత్తునికిని పేరగునపుడు ॥పు॥ వాయ
వును సహింపనివానికి పేరగునపుడు ॥త్రి॥

చపలః పారదే కీశే పు
చపలః - ఇది పాదరసమునకును, కోతికిని పేరగునపుడ

పర్వినీతే ధ్రుతే నీచే చప
ౕ తటితి స్త్రియామ్.
తరళో హారమధ్యస్థమణౌ
గా చఞ్చలే త్రిషు,
పర్యాప్తౌ సుకృతే క్షే
మే కుశలం నిపుణే త్రిషు.
త్రిషు శ్రేష్ఠే సితే ర
మ్యే ధవళో నా గుణే భ
వేత్, ధవళా గవ్య
థాశ్వత్థే పక్షిభేదేఽపి పి
ప్పలః. ౪౦౫. క్లీబం వస్త్ర
చ్ఛేదభేదే సలిలే పిప్పలీ క
ణా,
బహులోఽగ్నౌ కృష్ణప
క్షే పుమాం స్త్రీ ష్వసితే
బహూ. ౪౦౬. ఏలా భూ
కృత్తికా గోషు బహులా
స్యా ద
థోపలా, శర్కరాయాం
దృషత్పుత్రే స్త్రీన త్ర్యో
శ్శని నా మణౌ. ౪౦౭
పిఙ్గళోఽగ్నౌ మణౌ కీ
శే చణ్డాంశోః పారిపార్శ్వ
కే, త్రిష్వయం కపిలే యా
మ్యాదిక్కరిణ్యాం తు పిఙ్గళా.
కమ్బళోఽహిః క్రిమిస్సా
స్నా ప్రావారః కమ్బళం
జలమ్,
జాఙ్గలం నిర్జనస్థానే త్రిషు
మాంసే నపుంసకమ్. ౪౦౮
కన్దళీ మృగభేదే స్యా

దానికిని, నీచమైనదానికిని పేరగునపుడు ॥త్రి॥ మెఱుపునకును, లక్ష్మికిని పేరగునపుడు ॥సీ॥

తరళః-ఇది హారమధ్యమునను౦డు నాయకమణికి పేరగునపుడు ॥పు॥ చంచలమైనదానికి పేరగునపుడు ॥త్రి॥

కుశలం-ఇది సామర్థ్యమునకును, పుణ్యమునకును, లబ్ధసిద్ధికరణ మునకును పేరగునపుడు ॥న॥ నేర్పరికి పేరగునపుడు ॥త్రి॥

ధవళః-ఇది శ్రేష్ఠమైనదానికిని, తెల్లనిదానికిని, ఒప్పిదమైన దానికిని పేరగునపుడు ॥త్రి॥ తెలుపునకు పేరగునపుడు ॥పు॥ తెల్లనిగోవునకు పేరగునపుడు ॥సీ॥

పిప్పలః-ఇది రావిమ్రానికిని, పక్షివిశేషమునకును పేరగ నపుడు ॥పు॥ వస్త్రమునకును, ఖండభేదమునకును, ఉదకమునకున పేరగునపుడు ॥న॥ పిప్పలికి పేరగునపుడు ॥సీ॥ పిప్పలీ.

బహులః-ఇది అగ్నికిని, కృష్ణపక్షమునకును పేరగునపుడ ॥పు॥ నల్లనిదానికిని, విస్తారమైనదానికిని పేరగునపుడు ॥త్రి॥ ద్దయేలకులకును, భూమికిని, కృత్తికానక్షత్రమునకును, ఆవునకున పేరైనపుడు ॥సీ॥ ఇచ్చట కృత్తికానక్షత్రమునకు పేరైనపుడ స్త్రీలింగమును,బహువచనమునని యమరసింహుఁడు చెప్పెను.

ఉపలా - ఇది మొరమంటికిని, నూఱుఁబాలికిని పేర నపుడు ॥సీ॥ సామాన్యముగా ఱాతికి పేరగునపుడు ॥పు॥ మణి పేరగునపుడు ॥పు॥

పింగళః-ఇది అగ్నికిని, కోఁతికిని, సూర్యునికిని, పార్శ్వ మునను౦డు విఘ్నదేవతకును పేరగునపుడు ॥పు॥ పచ్చవన్నెగ దానికి పేరగునపుడు ॥త్రి॥ దక్షిణదిగ్గజముయొక్క భార్య పేరగునపుడు ॥సీ॥

కంబళః-ఇది సర్పవిశేషమునకును, కంబళిపురుగునకును, గడోలునకును, ఉత్తరీయమునకును పేరగునపుడు ॥త్రి॥ ఉ మునకు పేరగునపుడు ॥న॥

జాంగలమ్-ఇది జనరహితస్థలమునకు పేరగునపుడు ॥త్రి॥ మ సమునకు పేరగునపుడు ॥న॥

కందళీ - ॥సీ॥ఇది దొడ్డకడుపును నల్లనిముందరకాళ్లును మృగవిశేషమునకును పేరు.

| | |
|---|---|
| ...న్దళం తు నవాఙ్కురే, | కందళమ్-॥న॥ ఇది క్రొ త్తమొలకకు పేరు. |
| ...ణ్డలం వర్తులం పాశః ...భూషాఽ | కుండలమ్-॥న॥ ఇది వట్రువకును, త్రాటికిని, కర్ణభూష నకును పేరు. |
| ... కుణ్డలీ. ౪౧౦. భుజఙ్గే ...క్రకమృగే నా కుణ్డలవతి ...షు, | కుండలీ-॥న్-పు॥ ఇది సర్పమునకును, పెద్దపులికిని పేర డు ॥పు॥ కుండలములుగలవానికి పేరగునపుడు ॥త్రి॥ |
| ...ణ్డలీ నా రాజ్ఞి సూర్యేశ ...ఽపశాశ్వబిడాలయోః. | మండలీ-॥న్-పు॥ఇది రాజునకును, సూర్యునికిని, ఇంద్ర సర్పమునకును, కుక్కకును, పిల్లికిని పేరు. |
| ...ణ్డలం న ద్వయోః కు ...వ్యప సూర్యక భేకయోః, ...శ్చ ద్వాదశరాజౌఘేనికు ...శ్చాఽ | మండలమ్-॥న॥ ఎఱ్ఱపులుము అను రోగమునకును, పరివే నకును, కప్పకును, బింబమునకును, యుద్ధకాలమున రా ముందు వెనుకలుండు ౧౨ రాజులగుంపునకును, సమూహ కును పేరు. |
| ఫేనిలః. ౪౧౨. పు నరిష్టే బదరేక్లీబే ఫేన త్రిషు, | ఫేనిలః-ఇది కుంకుడుచెట్టుకు పేరగునపుడు ॥పు॥ రే డునకు పేరగునపుడు॥న॥నురుఁగుగలదానికి పేరగునపుడు |
| ...పుష్పీ పాటలో నా ...బల్యాం గవి పాటలా. ...ంతు పాటలీపుష్పే శ్వేత ...త్వయం త్రిషు, | పాటలః-ఇది ఎఱ్ఱనివడ్లకు పేరగునపుడు ॥పు॥ కలిగొ ట్టునకును, ఎఱ్ఱనియావునకును పేరగునపుడు ॥సీ॥ కలిగొట్టు ష్పమునకు పేరగునపుడు ॥న॥ తెలుపు నెఱుపుగూడిన వర్ణ పేరగునపుడు ॥త్రి॥ |
| ...ఙ్గారే నా వికసితే స్వ దీప్తే త్రిషూజ్జ్వలః. ౪౧౪ | ఉజ్జ్వలః-ఇది శృంగారమునకు పేరగునపుడు ॥పు॥ ... చినదానికిని, స్వచ్ఛమైనదానికిని, ప్రకాశమైనదానికిని ... నపుడు ॥త్రి॥ |
| ...శాదణ్డే ప్రవాళోఽ విద్రుమే నవపల్లవే, | ప్రవాళః ॥పు॥ ఇది వీణాదండమునకును, పవడమున లేఁతచిగురునకును పేరు. |
| ...వారు ణ్యుజ్జయిన్యో ...లా పృథులే త్రిషు. | విశాలా-ఇది పెద్దపాపరఁతీఁగెకును, ఉజ్జయినీపురమున పేరైనపుడు ॥సీ॥ విశాలమైనదానికి పేరైనపుడు ॥త్రి॥ |
| ...చలోఽద్రౌ భువ్యచలా | అచలః-ఇది పర్వతమునకు పేరగునపుడు ॥పు॥ భూ పేరగునపుడు ॥సీ॥ |
| ...పిలాఽఽగ్నేయధేనుకా ...పా రేణుకా గౌశ్చ ...నా పిఙ్గళే త్రిషు. ౪౧౬ | కపిలా-ఇది ఆగ్నేయదిక్కునందుండు నాఁడయేనుఁగున కంపుగల యిరుగుడుమ్రానికిని, తకోలమునకును, కపిల నకును బేరైనపుడు ॥సీ॥ మునికిఁ బేరైనపుడు ॥పు॥ గోరోచ వంటి వన్నెగలదానికిఁ బేరైనపుడు ॥త్రి॥ |

రసాలా మార్జికా దూ
ర్వా జిహ్వా నా త్విక్షు
చూతయోః,
నిర్ణీతే కేవలం క్లీబం త్రి
షు స్యా దేకకృత్స్నయోః,
సీలీ ధాత్ర్యో శ్శ్రీఫలీ
స్త్రీ బిల్వే పుంస్య
థ చఞ్చలా, తటిల్లక్ష్మ్యో
స్త్రీలిఙ్గోఽయం చపలే
థ త్రిషూత్తరే. ౪౧౦

కరాళం ద న్తురే తుఙ్గే భీ
షణే చా
థసంకులం, పరస్పరాహతవ
చస్యక్లిష్టేవ్యాకులేఽపిచ.
పేశలా చారు చతురా
పూర్ణశ్రేష్ఠాతు పుష్కలా,
ఉత్తాలా వుత్కటశ్రేష్ఠా
వాభీలా కృచ్ఛ్రభీషణౌ.
అఖిలా గర్హ్యాని శ్శేషా
బహులౌసాన్ద్రపుష్కలౌ,
ఇతి లాన్తాః.

---

మన్త్రీ సహాయ స్సచివౌ
వృషశ్రేష్ఠౌ తు పుఙ్గవౌ. ౪౨౧
పల్లవౌ సూర్యగోపాలౌ
మునిలోధ్రౌతు గాలవౌ,
కితవౌ ధూర్తదుత్తూరౌ
వాహవౌ యాగసఙ్గరౌ.
ప్రసవౌ స్యాతి వీణాఙ్గే
ప్రభావౌ శక్తితేజసీ,

రసాలా - ఇది దధిశర్కరాదులచేతఁ జేయఁబడినలేహ్యము నకును, దూర్వకును, నాలుకకును పేరైనపుడు ॥స్త్రీ॥ చెఱకుయొక్క భేదమునకును, తియ్యమామిడిచెట్టునకును పేరైనపుడు ॥పు॥

కేవలమ్-ఇదినిర్ణయింపఁబడినదానికిఁ బేరగునపుడు ॥న॥ ఒకటికిని, అంతటికిని పేరగునపుడు ॥త్రి॥

శ్రీఫలీ-ఇది నీలిచెట్టునకును, ఉసిరికచెట్టునకును పేరగునపుడు ॥స్త్రీ॥ బిల్వచెట్టునకుఁ బేరగునపుడు-శ్రీఫలః ॥పు॥

చఞ్చలా-ఇది మెఱుపునకును, లక్ష్మికిని పేరగునపుడు ॥స్త్రీ॥ చపలమైనదానికిఁ బేరగునపుడు ॥త్రి॥

అథ=ఇది మొదలు, ఉత్తరే=మీఁదఁ జెప్పఁగలబహుళ శబ్దమువఱకు, త్రిషు=మూఁడులింగములయందువర్తించును.

కరాళమ్-॥న॥ ఇది మిట్టపండ్లవానికిని, ఉన్నతమైనదానికిని భయంకరమైనదానికిని పేరు.

సఙ్కులమ్-॥న॥ ఇది పరస్పరము కొట్టువడినవాక్కునకును మఱియొకదానితోఁ గలిసినదానికిని, ఆకులమైనదానికిని పేరు

పేశలః-॥పు॥ ఇది ఒప్పిదమైనదానికిని, నేర్పరికిని పేరు.

పుష్కలః-॥పు॥ ఇది నిండినదానికిని, శ్రేష్ఠునికిని పేరు. [పేర

ఉత్తాలః-॥పు॥ఇదిఅతిశయమైనదానికిని, శ్రేష్ఠమైనదానికి

ఆభీలః-॥పు॥ఇదికష్టమైనదానికిని,భయంకరమైనదానికిని పేర

అఖిలః-॥పు॥ఇది నింద్యమైనదానికిని, మిగతలేనిదానికిని పేరు

బహులః-॥పు॥ ఇది దట్టమైనదానికిని, నిండినదానికిని పేరు

లాంతపదవర్గము ముగిసెను.

---

సచివః-॥పు॥ ఇది మంత్రికిని, తోడైనవానికిని పేరు.

పుంగవః-॥పు॥ ఇది ఎద్దునకును, ఉత్తరపదమైనప్పుడు శ్రేష్ఠునికిని పేరు.

పల్లవః-॥పు॥ ఇది సూర్యునికిని, గోవులమేపరికిని పేరు.

గాలవః-॥పు॥ఇదిఒకానొకమునికిని,లొద్దుగచెట్టునకును పేరు

కితవః-॥పు॥ఇది జూదగానికిని, ఉమ్మెత్తచెట్టునకును పేరు.

ఆహవః-॥పు॥ ఇది యాగమునకును, యుద్ధమునకును పే

ప్రసవః-॥పు॥ఇదిప్రసవమునకును, వీణయొక్కకరివెకును పే

ప్రభావః-॥పు॥ ఇది సామర్థ్యమునకును, తేజస్సునకును పే

త్రిదివౌ గగనస్వర్గౌ
సుహృద్బన్ధూచ బాన్ధవౌ.
ప్రభవో విక్రమేఽబ్దే చ
మూలే జననకారణే, ఆద్యో
పలబ్ధయే స్థానే
వివస్వాంస్తు సురే రవౌ.
ప్రసవః పుష్పఫలయోః ర్జ
ననానుజ్ఞయోస్సుతే, పా
రంపర్యప్రసఙ్గే చ ప్రాణి
గర్భవిమోచనే. ౪౭౫
ఉత్సవః కోపమహయో
రుత్సేకేచ్ఛాప్రసారయోః,
అవిశ్వాసాపహ్నవయోర్ని
కృతౌ చాపి నిహ్నవః.
గజస్కన్ధేఽపి పణవో

గన్ధర్వో గాయకే మృగే,
న్తరాభవసత్వేఽశ్వేఽ
థాశ్రవో వచనస్థితే. ౪౭౬
ప్రతిజ్ఞానే
చోద్ధవస్తు స్యాన్మహోక్ర
మన్త్రిణి,
సుషవీ స్త్రీ కారవేల్లే జీర
కృష్ణజీరకే. ౪౭౭
భైరవో నా క్షేత్రపాల
యోః భీషణే త్రిషు,
మాధవో వసన్తే వైశాఖే మా
ధవే
మాధవీ లతా. ౪౭౮. ౧
యా మప శోభాయాం
మసమ్బన్ధిని త్రిషు,
సైన్ధవో లవణే న స్త్రీ

త్రిదివః-॥పు॥ ఇది ఆకాశమునకును, స్వర్గమునకును పే
బాంధవః-॥పు॥ ఇది స్నేహితునకును, బంధువునకును పే
ప్రభవః-॥పు॥ ఇది పరాక్రమమునకును, సంవత్సరమున
మొదటిదానికిని, జననకారణమైనదానికిని, మొదట నెల
టకు స్థానమైనదానికిని పేరు.
వివస్వాన్-॥త్-పు॥ ఇది దేవతకును, సూర్యునికిని పేరు.
ప్రసవః-॥పు॥ఇది పుష్పమునకును, ఫలమునకును, పుట్టుక
అనుజ్ఞకును, కుమారునికిని, పారంపర్యప్రసంగమునకును, ప్ర
తికిని పేరు.

ఉత్సవః-॥పు॥ ఇది కోపమునకును, పండుగకును, ఉప్పొ
గుటకును, ఇచ్ఛపుట్టుటకును పేరు.
నిహ్నవః-॥పు॥ ఇది అవిశ్వాసమునకును, దాచుటకును,
స్కరించుటకును, అపశబ్దముపలన కపటమునకును పేరు.
పణవః-॥పు॥ ఇది ఏనుఁగు మూఁపునకును, అపశబ్దముః
నుడుక యను వాద్యవిశేషమునకును పేరు.
గంధర్వః-॥పు॥ ఇది గాయకునికిని, మృగవిశేషమునక
అంతరపిశాచమునకును, గుఱ్ఱమునకును పేరు.
ఆశ్రవః-॥పు॥ ఇది చెప్పినట్లు వినువానికిని, అంగీకారః
కును పేరు.
ఉద్ధవః-॥పు॥ ఇది పండుగకును, కృష్ణునిమంత్రికిని పేరు

సుషవీ-॥స్త్రీ॥ ఇది కాకరతీఁగెకును, జీలకఱ్ఱకును, నల్లజీలః
కును పేరు.
భైరవః-ఇది క్షేత్రపాలకునికిని,శివునికిని పేరగునపుడు ॥
భయంకరమైనదానికి పేరగునపుడు ॥త్రి॥
మాధవః-॥పు॥ ఇది విష్ణువునకును, వసంతర్తువునకును, వైశా
మాసమునకును పేరు.
మాధవీ-॥స్త్రీ॥ ఇది బండిగురివిందతీఁగెకును, లక్ష్మికిని, కా
కిని పేరు. వసంతకాలసంబంధమైనదానికి పేరగునపుడు 'మ
వః, మాధవీ, మాధవమ్' అని ముల్లింగములుం గలవు.
సైన్ధవః-ఇది ఉప్పునకుఁ బేరగునపుడు ॥పు॥ గుఱ్ఱమునః

హాయే నా సిన్ధుజే త్రిషు.

పేరగునపుడు ॥పు॥ సముద్రమునఁబుట్టినదానికి పేరైనపుడు ॥త్రి॥

ఆర్తవం స్త్రీరజః పుష్ప
మృతుసమ్బన్ధిని త్రిషు,

ఆర్తవమ్-ఇది స్త్రీలయొక్క ముట్టునెత్తురునకును, పుష్పమునకు పేరగునపుడు ॥న॥ ఋతుసంబంధమైనదానికి పేరగునపుడు ॥త్రి॥

శత్రుత్వే శాత్రవం నా
ఽరౌ

శాత్రవమ్-ఇది శత్రుభావమునకు పేరగునపుడు ॥న॥ శత్రువునకు పేరగునపుడు ॥పు॥

భార్గవీ స్యాదుమా రమా.
౪౩౧. దూర్వాఽ

భార్గవీ - ॥స్త్రీ॥ ఇది పార్వతికిని, లక్ష్మికిని, గరికెకును పేరు.

థ భార్గవః పుంసి రేణు
కాసురశుక్రయోః,

భార్గవః - ॥పు॥ ఇది పరశురామునకును, శుక్రునికిని పేరు.

గాణ్డీవ గాణ్డివౌ పార్థ
చాపే చాపే చ న స్త్రి
యామ్. ౪౩౨

గాండీవః-గాండివః - ॥పు॥ ఈ రెండును అర్జునుని వింటికిని, సామాన్యముగా వింటికిని పేళ్లు.

ప్రగ్రీవ మస్త్రీ గ్రీవా
యాం ప్రసాదేకలశేఽపిచ,

ప్రగ్రీవమ్ - ॥పు॥ ఇది మెడకును, స్వచ్ఛమునకును, కడవకును పేరు.

తపస్వీ తాపసే శోచ్యే

తపస్వీ-॥న్-పు॥ ఇది మునికిని, దీనునికిని పేరు.

ద్విజిహ్వో భుజగే ఖలే.

ద్విజిహ్వః-॥పు॥ ఇది సర్పమునకును, దుర్జనునికిని పేరు.

పార్థివో భూపతౌ భూత్థే

పార్థివః - ॥పు॥ ఇది భూమిని బాలించువానికిని, భూమినిఁ బుట్టినదానికిని పేరు.

క్రమాత్పుంసి త్రిషు
త్రయః,

త్రయః = క్రిందచెప్పిన, తపస్వి - ద్విజిహ్వ - పార్థివశబ్దములు మూఁడును, క్రమాత్=వరుసగా, పుంసి = పుంలింగమందును, త్రిషు=ముల్లింగములయందును వర్తించును. అనగా మునికిని, పామునకును, భూమినేలు రాజునకును పేరగునపుడు పుంలింగములును, దీనులకును, దుర్జనులకును, భూమినిఁ బుట్టినవానికిని పేరగునపుడు త్రిలింగములనుట.

రాజీవ మబ్జే రాజీవో
మృగే మత్స్యేఽ

రాజీవమ్ - ఇది తామరపుష్పమునకుఁ పేరగునపుడు ॥న॥ మృగవిశేషమునకును, గుంపును వెంటద్రిప్పుకొను మత్స్యభేదమునకును పేరగునపుడు ॥పు॥

థ పల్లవః. ౪౩౪. అస్త్రీ
ప్రవాళే నా షిద్గే

పల్లవః - ఇది చిగురునకును పేరగునపుడు ॥పు॥ విటునికి పేరగునపుడు ॥పు॥

కైతవం ద్యూతదమ్భయోః,
ఇతి వాన్తాః.

కైతవమ్ - ॥న॥ ఇది ద్యూతమునకును, డంబమునకును పేరు.

వాంతపదవర్గము ముగిసెను.

---

రహః ప్రకాశౌ వీకాశౌ
రక్షో వృక్షౌ పలాశినౌ.
నివేశౌ శిబిరోద్వాహౌ
గిరీశౌ శఙ్కరాద్రిపౌ,
ఆదర్శౌ దర్పణేషీకే

నిదేశః కథనాజ్ఞయోః.
నిర్వేశ స్స్వమ్మూర్ఛనే స్యా
త్కర్మభృత్యుపభోగయోః,

ప్రకాశః కిరణేభాసి నా
తుల్యస్ఫుటయో స్త్రిషు.
యమే రక్షసి కీనాశః క
ర్షకే కృపణే త్రిషు,
పత్రే పలాశం హరితే రా
క్షసే కింశుకే పుమాన్.
నిస్త్రింశోఽసౌ త్రిషు
క్రూరే మత్స్యే వా
కులిశం పవౌ,
అథ త్రి ష్వవశం త్రాత్మా
వశోఽరిష్టదుష్టధీః.
కర్కశో నిర్దయః క్రూరః
పరస్పర్శశ్చ సాహసీ,
బాలిశౌ మూర్ఖపృథుకౌ
సదృశౌ తు సమోచితౌ.
ఇతి శాంతాః.

---

నిమేష నిమిషౌ సూక్ష్మ
కాలే పక్ష్మణి పావనే,
పురుషో ధాతృపున్నాగ
రాత్మపరమాత్మసు. ౪౪౧

వీకాశః-॥పు॥ఇవి కాంతస్థలమునకును, స్ఫుటమైనదానికిని పేర
పలాశీ - ॥న్-పు॥ ఇది రాక్షసునకును, వృక్షమునకును పేర
నివేశః-॥పు॥ఇది దండుదిగిన తావునకును, వివాహమునకుఁ బేర
గిరీశః - ॥పు॥ ఇది శివునికిని, పర్వతశ్రేష్ఠమునకును పేరు.
ఆదర్శః-॥పు॥ ఇది అద్దమునకును, తృణాదులయొక్క దుబ్బ
కును పేరు.
నిదేశః-॥పు॥ ఇది చెప్పుటకును, ఆజ్ఞకును పేరు.
నిర్వేశః - ॥పు॥ ఇది అంతట వ్యాపించుటకును, కార్యము
కిచ్చు కూలికిని, భోగమునకును పేరు.

ప్రకాశః-ఇది కిరణమునకును, కాంతికిని పేరగునపుడు ॥పు
సమానమైనదానికిని, స్ఫుటమైనదానికిని పేరగునపుడు ॥త్రి॥
కీనాశః - ఇది యమునికిని, రాక్షసునకును పేరగునపుడు
॥పు॥ కృషి చేయువానికిని, కృపణునకును పేరగునపుడు ॥త్రి॥
పలాశమ్-ఇది ఆకునకుఁ పేరగునపుడు ॥న॥ పచ్చనీరుల్లికి
రాక్షసునికిని, మోదుగుచెట్టునకును పేరగునపుడు ॥పు॥
నిస్త్రింశః - ఇది ఖడ్గమునకుఁ పేరగునపుడు ॥పు॥ క్రూరుని
పేరగునపుడు ॥త్రి॥ మత్స్యమునకుఁ పేరగునపుడు ॥పు॥
కులిశమ్ - ॥న॥ ఇది వజ్రాయుధమునకుఁ పేరు.
వివశః-॥త్రి॥ ఇది స్వాధీనబుద్ధిలేనివానికిని, ఆసన్నమరణవ
చేత దూషితమైన బుద్ధిగలవానికిని పేరు.
కర్కశః-॥త్రి॥ ఇది దయలేనివానికిని, క్రూరునికిని, వేఁడి
యగు స్పర్శగలదానికిని, సాహసవంతునికిని పేరు.
బాలిశః - ॥త్రి॥ ఇది మూర్ఖునికిని, బాలునికిని పేరు. [పేరు
సదృశః-॥త్రి॥ఇది సమానమైనదానికిని, యోగ్యమైనదానికి
శాంతపదవర్గము ముగిసెను.

---

నిమేషః-నిమిషః-॥పు॥ ఈరెండును, సూక్ష్మకాలభేదమున
కును, ఱెప్పకును, పరిశుద్ధమునకును పేళ్లు.
పురుషః - ॥పు॥ ఇది బ్రహ్మకును, సురపొన్నచెట్టునకును
మనుష్యునికిని, జీవునకును, పరమాత్మకును పేరు.

...్యాత ఇన్ద్రియే,
...విశేషోఽవయవే వ్యక్తౌ
...కేఽత్యన్తభేదకే. ౪౪౩
ప్రదోషో దోషరాత్ర్యం

...వభీషూ రశ్మిదీధితీ,
సజ్ఘర్షౌ ఘర్షణ స్పర్ధే
శైలూషో బిల్వ నర్తకౌ.
ఆమిషం త్వ స్త్రియాం
...ాంస ఉత్కోచే భోగ్య
...స్తుని,
దిధిషూః స్త్రీ ద్విరూఢా
...యాం తత్పతౌ దిధిషుః
...మాన్. ౪౪౪
రోహిషం రక్తకతృణే క్లీ
...దే మత్స్యే మృగే చ నా,
పౌరుషం విక్రమే భావ
...ర్మణోః పురుషస్య చ. ఉ
...న్నాహు విస్తృత కరనరమా
...నే తు వాచ్యవత్,
పరిచర్యాఽపి శుశ్రూషా

మంజూషా పేటికా పురీ.
నృపాగ్రపత్నీ సైరిభ్యోర్మ
హిషీ
కిల్బిషం త్వఘే, అపరా
ధేఽప్య
థోష్ణీష శ్శిరోవేష్ట కిరీట
యోః. ౪౪౫
నవసూతగవీదుగ్ధే పీయూ
ష మమృతేఽపి చ,
వానా దివ్యవిషే నాఽబ్ధౌ

...జాదమునకును, చక్షురాదీంద్రియములకుఁ బేరు.

విశేషః - ॥పు॥ ఇది అవయవమునకును, ప్రకాశమునకును, నుదుటబెట్టు తిలకమునకును, భేదమునకును బేరు.

ప్రదోషః-॥పు॥ఇది దోషమునకును, రాత్రియం దొకయంశమునకును పేరు.

అభీషుః - ॥పు॥ ఇది పగ్గమునకును, కిరణమునకును పేరు.

సంఘర్షః-॥పు॥ ఇది ఒరిసికొనుటకును, కలహమునకును పేరు.

శైలూషః-॥పు॥ఇది మారేడుచెట్టునకును, నట్టువవానికిని పేరు.

ఆమిషమ్ - ॥న॥ఇది మాంసమునకును, కానుకకును, భోగ్యవస్తువునకును పేరు.

దిధిషూః - ఇది మాఱుమనువుమాడిన స్త్రీకి పేరగునపుడు ॥స్త్రీ॥ ఆస్త్రీని పెండ్లాడిన పురుషునికి పేరగునపుడు-దిధిషుః ॥పు॥

రోహిషమ్ - ఇది ఎఱ్ఱకామంచికసవునకు పేరైనపుడు ॥న॥ ఎఱ్ఱమీనునకును, కొండగొఱ్ఱెకును పేరైనపుడు ॥పు॥

పౌరుషమ్ - ఇది పరాక్రమమునకును, పురుషుని భావమునకును, వాని కార్యమునకును బేరైనపుడు ॥న॥ మనుష్యుఁ చెయ్యెత్తుపొడవునకును పేరైనపుడు విశేష్యలింగము.

శుశ్రూషా - ॥స్త్రీ॥ ఇది శుశ్రూషకును, ఆశబ్దమువలన పి... వలయుంనను నిచ్ఛకును పేరు.

మంజూషా - ॥స్త్రీ॥ ఇది పెట్టెకును, పురమునకును పేరు.

మహిషీ - ॥స్త్రీ॥ ఇది రాజుయొక్క పట్టపుదేవికిని, గే... కును పేరు.

కిల్బిషమ్-॥న॥ ఇది పాపమునకును, అపరాధమునకును బేర...

ఉష్ణీషః-॥పు॥ ఇది తలకుఁబెట్టెడు పాగా మొదలైనవానికి... కిరీటమునకును బేరు.

పీయూషః - ॥న॥ఇది ఈనిన యేడుదినములలోని యా... పాలకును, అనఁగా:-జున్నునకును, అమృతమునకును పేరు.

ఆవిషః - ఇది దివ్యవిషమునకు పేరగునపుడు ॥న॥ సము...

వవిషో నిర్విషే త్రిషు. ౪౪౮
గణ్డూషస్తు ద్వయో రాస్య
పూతౌ ద్విరద పుష్కరే,
ప్రసృతౌ చా
థ కలుషంక్లీబేఽంహస్యా
విలే త్రిషు. ౪౪౯
నికష శ్శాణఫలకే నారక్షో
మాతరి స్త్రియామ్,
నికషాఽవ్యయ మభ్యాశే
కల్మాషః కృష్ణపాణ్డరే. కృ
ష్ణే చ త్రిషు పుంస్యేవ దా
నవే యూపకే గుణే,
పరుషో నిష్ఠురే రూక్షే
కర్బురే చ త్రిలిఙ్గకః. ౪౫౧
ఇతి షాన్తాః.

శ్రీవాసో వృక్షధూపేఽబ్జే
రభసో వేగహర్షయోః,
నభః ఖే శ్రావణే పుంసి
విలాసో భావలీలయోః.
వాహసోఽగ్నా వజగరే
భీభత్సో రస పార్థయోః,
సాయక క్షేపక ద్రోణ్యా
మిష్వాసః కార్ముకేఽప్య
థ. ౪౫౩. ఆఖ్యాయికా
పరిచ్ఛేదేఽప్యాశ్వాసో ని
ర్వృతౌ
వథ, శ్రేయసీ గజపిప్ప
ల్యా మభయా రాస్నయో
రపి. ౪౫౪

మునకు పేరగునపుడు ॥పు॥ విషము లేనిదానికి పేరగునపుడు ॥

గండూషః-॥పు॥ ఇది పుక్కిటినీళ్లకును, ఏనుఁగుతొండ గొనకును, చేరకును పేరు.

కలుషమ్ - ఇది పాపమునకు పేరైనపుడు ॥న॥ కలి దానికి పేరైనపుడు ॥త్రి॥

నికషః - ఇది సానరాతికి పేరగునపుడు ॥పు॥ రాక్షః తల్లికి పేరగునపుడు ॥స్త్రీ॥

నికషా - ఇది సమీపమునకుఁ బేరగునపు డవ్యయము.

కల్మాషః - ఇది చిత్రవర్ణముగల దానికిని, నల్లని దాని బేరగునపుడు ॥త్రి॥ రాక్షసునకును, అలచందలకును, ఛత్ర మునకును బేరగునపుడు ॥పు॥

పరుషః -॥త్రి॥ ఇది కఠినమైనదానికిని, పరుసనిదాని చిత్రవర్ణముగలదానికిని పేరు.

షాంతపదవర్గము ముగిసెను.

---

శ్రీవాసః - ॥పు॥ ఇది దేవదారుబంకకును, కమలమునకు మఱియుం విష్ణుదేవునకును బేరు.

రభసః - ॥పు॥ ఇది వేగమునకును, సంతసమునకును బేరు

నభః - ॥న-న॥ ఇది ఆకాశమునకు పేరు. శ్రావణమ మునకు పేరగునపుడు-నభాః ॥పు॥

విలాసః-॥పు॥ ఇది శృంగారభావమునకును, లీలలకును పే

వాహసః - ॥పు॥ ఇది అగ్నికిని, కొండచెలగకును బేరు.

భీభత్సః - ॥పు॥ ఇది రసభేదమునకును, అర్జునునకును బే

ఇష్వాసః - ॥పు॥ ఇది బాణముంచు దొనకును, వింటికిని బే

ఆశ్వాసః - ॥పు॥ ఇది సత్యమైన యర్థముగల హర్షచరి మొదలైన కృతియొక్క భాగమునకును, ఊరడింపునకుఁ బే

శ్రేయసీ - ॥స్త్రీ॥ ఇది గజపిప్పలికిని, కరకచెట్టునకును, స రాస్నకును బేరు.

జుగుప్సా తు ఘృణానిన్దా
చిత్తే సరసి మానసమ్,
సాహసం తు బలాత్కార
కృతకర్మ దమోఽపి తత్.
అలసో సా పాదరోగే
వృక్షే మన్దే త్వయం త్రిషు,
లాలసః ప్రార్థనౌత్సుక్యే
దౌహృదాత్యభిలాషయోః.
పాయసం పరమాన్నే స్యా
చ్ఛ్రీవాసే నాఽ
థ సారసమ్, పద్మేనా తు
ఖగే చన్ద్రే
కీకసం త్వస్థి సా స్త్రియామ్.
ఇతి సాంతాః.

---

నివహో వాయుభేదేఽపి
కలహో ద్వన్ద్వయుద్ధయోః,
నిర్వ్యూహ శ్శేఖరే ద్వారే
నిర్వ్యాసే నాగదన్తకే. కషా
క్వాథే రసేఽ
థ దాత్యూహ శ్చాతకే
కాలకణ్ఠకే,
ప్రవాహః పాథసాం వేగే
ప్రకృష్టాశ్వే ప్రవర్తనే.
ప్రవహ స్స్యా ద్వాయు
భేదే వాయుమాత్రే బహి
ర్గతౌ,
స్వీకారోచ్ఛ్రాయసంక్షేప
మహోద్యోగేషు సఙ్గ్రహః.
అగ్రహోఽనుగ్రహే సక్తి
నిర్బన్ధ గ్రహణేష్వ

జుగుప్సా - ॥స్త్రీ॥ ఇది దయకును, నిందకును పేరు.

మానసమ్ - ॥న॥ ఇది చిత్తమునకును, సరస్సునకును పేరు.

సాహసమ్ - ॥న॥ ఇది బలాత్కారమునఁ జేసిన కార్యమునకును, దండమునకును పేరు.

అలసః - ఇది పాదరోగమునకును, వృక్షమునకును పేరగునపుడు ॥పు॥ మందునికిఁ బేరగునపుడు ॥త్రి॥

లాలసః-॥ప్స॥ ఇది వేఁడుకొనుటకును, ఇష్టవస్తువెపుడుకలుగనను ననురాగవిశేషమునకును, వేవిళ్లకును, అత్యాశకును పేరు.

పాయసమ్ - ఇది పరమాన్నమునకుఁ బేరగునపుడు ॥న॥ దేవదారుబంకకుఁ బేరగునపుడు ॥పు॥

సారసమ్ - ఇది పద్మమునకుఁ బేరగునపుడు ॥న॥ బెగ్గురుపక్షికిని, చంద్రునికిని బేరగునపుడు ॥పు॥

కీకసమ్ - ఇది ఎముకకుఁ బేరైనపుడు ॥న॥ పురుగునకుఁ బేరై [నపుడు ॥పు

సాంతపదవర్గము ముగిసెను.

---

నివహః - ॥పు॥ ఇది వాయుభేదమునకును, అపిశబ్దమువలఁ గుంపునకును పేరు.

కలహః - ఇది మిథునమునకును, యుద్ధమునకును పేరు.

నిర్వ్యూహః - ॥పు॥ ఇది సిగనుజుట్టిన పూలదండకును, ద్వారమునకును, బంకకును, కొణిగెను నాధారముగా గోడయందు నాటిన కొయ్యకును, కషాయమునకును, గంధమునకును పేరు.

దాత్యూహః-॥పు॥ ఇది చాతకపక్షికిని, భరతపక్షికిని పేరు

ప్రవాహః - ॥పు॥ ఇది ఉదకవేగమునకును, శ్రేష్ఠాశ్వమునకును, ప్రవర్తించుటకును పేరు.

ప్రవహః - ॥పు॥ ఇది వాయువిశేషమునకును, వాయుమాత్రమునకును, బయలువెడలుటకును పేరు.

సంగ్రహః - ॥పు॥ ఇది గ్రహించుటకును, పర్వతాదపొడవునకును, సంక్షేపమునకును, అతిప్రయత్నమునకును పే

అగ్రహః - ॥పు॥ ఇది అనుగ్రహమునకును, ఆసక్తి నిర్బంధమునకును, గ్రహించుటకును పేరు.

ష, క్రోడ్యా మారోహణే
దైర్ఘ్యే సముచ్ఛ్రాయే నిషా
దిని. ౪౬౧ ఆరోహ స్స్య
త్కటాహస్తు హర్మ్యస్య
ష్టేచ కర్పరే, తైలాదిపాక
పాత్రేఽథ నిగ్రహస్సీమ్ని
భర్త్సనే. ౪౬౨.
వరాహ స్సూకరే విష్ణౌ
నాణకే శైల ముస్తయోః,
తులా సూత్రేఽశ్వాదిరశ్మౌ
ప్రగ్రాహ ప్రగ్రహౌ వుభౌ.
విగ్రహ స్సఙ్గరే దేహే
విస్తరేఽప్య
థ నిర్దహః, భేద్యవ త్పర
దోషో క్తిపరే నిష్ఠురభాషిణి.
సువహా సల్లకీ గోధాపదీ
శేఫాలికాసు చ,
వైదేహీ స్యా ద్వణిగ్యోషి
త్పిప్పలీ జనకాత్మజా. ౪౬౩
ఇతి హాన్తాః.

---

ప్రత్యక్షే ఽధికృతేఽ
ధ్యక్ష స్త్రీ
ష్వారక్ష స్తు రక్షణే, అథ
శ్చ దన్తికుమ్భస్య
హర్యక్ష శ్శ్రీదసింహయోః.
రక్తాక్షో మహిషే దైత్యే
పారావత చకోరయోః,
గోధుంబాయాం గవాక్షీ స్త్రీ
గవాక్షో జాలకే పుమాన్.
ఇతి క్షాన్తాః.

ఆరోహః-॥పు॥ ఇది స్త్రీలయొక్క పిఱుందునకును, ఎక్కుటకును, దీర్ఘభావమునకును, పర్వతాదుల పొడవునకును, మావటివానికిని పేరు.

కటాహః - ఇది మేడయొక్క పైచదరమునకును, తొట్టికిని, తైలాదులఁ గాచు పాత్రకును పేరు.

నిగ్రహః - ॥పు॥ ఇది మర్యాదకును, బెదరించుటకును పేరు.

వరాహః - ॥పు॥ ఇది అడవిపందికిని, విష్ణువునకును, వరహాకును, పర్వతమునకును, తుంగముస్తలకును పేరు.

ప్రగ్రాహః-ప్రగ్రహః-॥పు॥ ఈరెండును త్రాసుకోల మొదలైనవానిత్రాటికిని,గుఱ్ఱము మొదలైనవానిగట్టు పగ్గమునకుఁ బేళ్లు.

విగ్రహః- ॥పు॥ ఇది యుద్ధమునకును, దేహమునకును, శబ్దముల విరివికిని పేరు.

నిర్దహః - ఇది పరులదోషములఁ జెప్ప నిచ్ఛగలవానికిని, కఠినోక్తులఁ జెప్పువానికిని పేరైనపుడు ॥విశేష్యలింగము॥

సువహా - ॥స్త్రీ॥ ఇది చిల్లచెట్టునకును, చెప్పుతట్టయాకునకును, నల్లపువ్వుల వావిలిచెట్టునకును పేరు.

వైదేహీ - ॥స్త్రీ॥ ఇది వర్తకునిభార్యకును, పిప్పలికిని, సీతకును నామము.

హాంతపదవర్గము ముగిసెను.

---

అధ్యక్షః - ॥త్రి॥ ఇది ప్రత్యక్షమునకును, అధికారముగలవానికిని పేరు.

ఆరక్షః - ॥పు॥ ఇది రక్షించుటకును, ఏనుఁగు కుంభస్థలముయొక్క దిగువకును పేరు.

హర్యక్షః - ॥పు॥ ఇది కుబేరునకును, సింహమునకును పేరు

రక్తాక్షః - ॥పు॥ ఇది మహిషమునకును, దైత్యునకును, పావురమునకును, చకోరపక్షికిని పేరు.

గవాక్షీ - ॥స్త్రీ॥ బుడమతీఁగెకుఁ బేరు.

గవాక్షః - ॥పు॥ ఇది సూరణగంతకు పేరు.

క్షాంతపదవర్గము ముగిసెను.

శ్లో. ఇతి జగదుపకారిణ్యా మిరుగపదణ్డాధినాథరచితాయామ్,
త్ర్యక్షరపదకాణ్డోఽయం పూర్ణో నానార్థరత్నమాలాయామ్. ౪౬౪

టీక. జగదుపకారిణ్యామ్ - జగత్ = లోకమునకు, ఉపకారిణ్యామ్ = ఉపకారకమైనదియు, ఇరుగపదణ్డాధినాథరచితాయామ్ - ఇరుగపదణ్డాధినాథ = ఇరుగపదండనాథుని చేత, రచితాయామ్=చేయఁబడినదియునగు, నానార్థరత్నమాలాయామ్ = నానార్థరత్నమాలయను గ్రంథమునందు, అయమ్ = ఈ, త్ర్యక్షరపదకాణ్డః - త్ర్యక్షర = మూఁడక్షరములుగల, పద = శబ్దములయొక్క, కాణ్డః = సమూహము, ఇతి = ఈ పూర్వోక్తప్రకారముగా, పూర్ణః = ముగిసెను.

త్ర్యక్షర కాండము

సంపూర్ణము.



# చతురక్షరకాండము.



పిక భృఙ్గా వళిపికౌ
పిక భేకౌ వలాసకౌ,
భృఙ్గాలకౌ భ్రమరకౌ
శ్రీవత్సాఙ్కౌ వృషాచ్యుతౌ. ౧

ఆఖుక్రోడా వాఖనకౌ గిరి
మేఘౌ వలాహకౌ,
కర్కోటకౌ బిల్వసర్పౌ
దన్దశూకోఽహి రక్షసోః.
స్థూలరజ్జౌ బీజకోశే వరా
టే చ వరాటకః,
భట్టారకో భూమిపాలే
దివౌకసి తపోధనే. ౩

అఙ్గారక స్తూల్ముకస్య ఖణ్డే
భౌమే కురణ్టకే,
సాలావృక స్సారమేయే
వృకే క్రోష్టరి మర్కటే. ౪

వినాయక స్తు సుగతే గరు
త్మతి గణాధిపే,
హారభేదే మాణవకో బా
లే కుపురుషే చ సః. ౫

పుణ్డరీకం సితచ్ఛత్త్రే కుష్ఠ
భేదే సితామ్బుజే, నా త్వా
మ్రే రజతే వ్యాఘ్రే దిగ్గజే
కుఞ్జరే స్వరే. ౬

నియామకః పోతవాహే నా
నియన్తరి తు త్రిషు,
భయానక స్తు శార్దూలే

అళిపికః - ॥పు॥ ఇది కోకిలకును, తుమ్మెదకును పేరు.

వలాసకః - ॥పు॥ ఇది కోకిలకును, కప్పకును పేరు.

భ్రమరకః - ॥పు॥ ఇది తుమ్మెదకును, ముంగురులకును పేర

శ్రీవత్సాంకః - ॥పు॥ ఇది వృషభమునకును, విష్ణువునకు పేరు.

ఆఖనకః - ॥పు॥ ఇది పందికొక్కునకును, అడవిపందికిని పేర

వలాహకః - ॥పు॥ ఇది పర్వతమునకును, మేఘమునకును పేర

కర్కోటకః - ॥పు॥ ఇది బిల్వవృక్షమునకును, సర్పమునకును పేర

దందశూకః - ॥పు॥ ఇది సర్పమునకును, రాక్షసునికిని పేర

వరాటకః - ॥పు॥ ఇది లావైనత్రాటికిని, తామరకాయకున గవ్వకును పేరు.

భట్టారకః - ॥పు॥ ఇది భూమిని బాలించు రాజునకును, దేవ కును, తపస్వికిని పేరు.

అంగారకః - ॥పు॥ ఇది కొఱవితునుకకును, అంగారకునకు పచ్చపువ్వుల గోరింటకును పేరు.

సాలావృకః - ॥పు॥ ఇది రేజుక్కకును, తోడేటికి నక్కకును, కోతికిని పేరు.

వినాయకః - ॥పు॥ ఇది బుద్ధదేవునికిని, గరుత్మంతునకు గణపతికిని పేరు.

మాణవకః - ॥పు॥ ఇది ఇరువదిసరముల ముత్యాలహారము కును, బాలునకును, కుత్సితపురుషునికిని పేరు.

పుండరీకం - ఇది తెల్లగొడుగునకును, తెల్లపులుమునకును, తె తామరపువ్వునకును పేరగునపుడు ॥న॥ మామిడిచెట్టునకును, వెం కిని, పెద్దపులికిని, ఆగ్నేయభాగమునసున్న దిగ్గజమునకును, మాన్యమైనయేనుగునకును, స్వరభేదమునకును పేరగునపుడు ॥

నియామకః - ఇది ఓడకంబముమీఁదనుండి యుపాయ చెప్పువానికి పేరైనపుడు ॥పు॥ నియామకునకు పేరైనపుడు ॥త్రి

భయానకః - ఇది పెద్దపులికిని, రాహువునకును పేరైనపు

...హసా నా భీషణే త్రిషు.
పుమాన్ బృన్దారకో దేవే
త్రిషు శ్రేష్ఠమనోజ్ఞయోః,
కాలేయక స్స్వరమేయే
రా కులిసే తు వాచ్యవత్.
వక్త్రయో మయూరసరట
సకుక్కుటాః కృకవాకవః.
స్యాత్సోమవల్కః ధవళ
ఖదిరే కట్ఫలేఽపి చ. ౯
పాఞ్చాలికా పుత్త్రికా
యాం ద్రౌపదీరీతిభేదయోః,
కనీనికాఽక్షితారాయాం
స్యాత్కనిష్ఠాంగుళావపి.
వాద్యానాం లగుడే వా
ద్యభేదే ఘుర్ఘురికా భవేత్.
జీవన్తికా తు జీవాయాం
గుడూచీవన్దయో రపి. ౧౧
ఉత్కణ్ఠాయా ముత్కలి
కా సైవ హేలా తరఙ్గ
యోః,
కోశాతకీజ్యోత్స్నికాయా
మపామార్గే చ సా భవేత్.
సౌగన్ధికం తు కహ్లారే ప
ద్మరాగే చ కత్తృణే,

రక్తర్ధికం సుఖే స్థానే
దివసే మఙ్గళేఽప్య
థ. ౧౩. త్రిఫలాయాం
త్రికటుకే త్రిగన్ధే చ త్రివ
ర్ణకమ్,
స్తనవృత్తే పిప్పలక మపి
సేవనసూత్రకే. ౧౪

॥పు॥ భయంకరమైనదానికి పేరైనపుడు ॥త్రి॥

బృందారకః—ఇది దేవతకు పేరైనపుడు ॥పు॥ శ్రేష్ఠునికిని, ఒప్పిదమైనదానికిని పేరైనపుడు ॥త్రి॥

కాలేయకః—ఇది కుక్కకు పేరైనపుడు ॥పు॥ కులశ్రేష్ఠునికి పేరైనపుడు విశేష్యలింగము.

కృకవాకుః — ॥పు॥ ఇది నెమలికిని, ఊసరవెల్లికిని, కోడికిని పేరు.

సోమవల్కః — ॥పు॥ ఇది తెల్లచంద్రచెట్టునకును, గుమ్మడిచెట్టునకును పేరు.

పాంచాలికా॥స్త్రీ॥ ఇది పుత్తలికకును, ద్రౌపదికిని, రీతివిశేషమునకును పేరు.

కనీనికా — ॥స్త్రీ॥ ఇది కంటినల్లగుడ్డునకును, చిటికెనవ్రేలికిని పేరు.

ఘుర్ఘురికా—॥స్త్రీ॥ ఇది వాద్యములవాయించుకోలకును, వాద్యభేదమునకును పేరు.

జీవంతికా — ॥స్త్రీ॥ ఇది పాలకూరకును, తిప్పతీఁగెకును, బదనికకును పేరు.

ఉత్కలికా — ॥స్త్రీ॥ ఇష్టవస్తుప్రాప్తియందలి కాలవిళంబము నోర్వఁజాలక తహాతహపడుటకును, విలాసమునకును, అలకును పేరు.

కోశాతకీ — ॥స్త్రీ॥ ఇది పొళ్లచెట్టునకును, ఉత్తరేణికిని పేరు. చకారమువలన అవడచెట్టునకును పేరు.

సౌగంధికమ్ ॥న॥ ఇది ఇంచుకయెఱుపును మిక్కిలి పరిమళమును గలకలువకును, పద్మరాగమణికిని, కామంచికసవునకును పేరు. చకారమువలన సుగంధముగలదానికిఁ బేరైనపుడు ॥త్రి॥

రక్తర్ధికమ్—॥న॥ ఇది సుఖమునకును, స్థానమునకును, పగటికిని, శుభమునకును పేరు.

త్రివర్ణకమ్—॥న॥ ఇది కరక తాడి ఉసిరికాయలకును, శొంఠి పిప్పలి మిరియాలకును, కస్తూరి గోరోచన కుంకుమపువ్వులకును పేరు.

పిప్పలకమ్—॥న॥ ఇది స్త్రీస్తనాగ్రమునకును, కుట్టుడుదారమునకును పేరు.

తిన్త్రిణీకం ఫాదపామ్లే చింతాయా మప్య

తింత్రిణీకమ్—॥న॥ ఇది చింతపండునకును, చింతకును పే

థాస్త్రియాం, విశేషకం స్యాత్తిలకే విశేషాదాయకే త్రిషు. ౧౫

విశేషకమ్—ఇది నుదుటఁబెట్టుబొట్టునకుఁ బేరైనపుడు విశేషాదాయముగలదానికి పేరైనపుడు ॥త్రి॥

శూద్రా ద్వైదేహకో వైశ్యాసుతే నా వణిజి త్రిషు,

వైదేహకః—ఇది శూద్రునివలనఁ గోఁవటిస్త్రీకిఁబుట్టిన పేరగునపుడు ॥పు॥ వర్తకునికి పేరగునపుడు॥త్రి॥

మయూరక స్త్వపామార్గే పుమాన్ క్లీబే తు తుత్థకే

మయూరకః - ఇది ఉత్తరేణిచెట్టునకు పేరగునపుడు మైలతుత్తమునకు పేరగునపుడు ॥న॥

సుప్రతీకో భేద్యలిఙ్గ శ్శుభాఙ్గే దిగ్గజే పుమాన్,

సుప్రతీకః—ఇది అందమైన మేనుగలవానికి పేరైనపుడు ష్యలింగము॥ ఈశాన్యదిశనున్న దిగ్గజమునకు బేరగునపుడు

పలమానే షోడశికా సదా న స్త్రీ పలద్వయే. ౧౬

షోడశికా—ఇది ఒకపలమెత్తునకు పేరగునపుడు ॥స్త్రీ డుపలములయెత్తునకు పేరగునపుడు ॥న॥

జైవాతృకః కర్షకేన్ద్వో ర్వైద్యే నాఽఽయుష్మతి త్రిషు,

జైవాతృకః—ఇది దున్నువానికిని, చంద్రునికిని, వైద పేరగునపుడు ॥పు॥ ఆయుష్మంతునికిని పేరగునపుడు ॥త్రి

త్రిషు వృద్ధే శతానీకో. మునౌ పుంస్య

శతానీకః—ఇది వృద్ధునికి పేరగునపుడు ॥త్రి॥ మునికి నపుడు ॥పు॥

థ వాచ్యవత్. ౧౭. కార్యాక్షమః ప్రభోర్భావవర్థీ లాలాటికః పుమాన్.

లాలాటికః—ఇది కార్యమును జేయ శక్తిలేనివానికిని, ప్ర యొక్కభావమును దెలిసికొనువానికిని పేరగునపుడు ॥ లింగము.

అదూరేరితదృగ్దమ్భయుక్తః కౌక్కుటికః పుమాన్.

కౌక్కుటికః - ఇది సమీపమును చూచుచుంబోవు వ దంభముగలవానికిని పేరు.

ఇతి కాంతాః.

కాంతపదవర్గము ముగిసెను.

---

గజకూర్మౌ పఞ్చనఖౌ భృఙ్గబాణౌ శిలీముఖౌ,

పంచనఖః—॥పు॥ ఇది ఏనుఁగునకును, తాఁబేటికిని పే

శిలీముఖః—॥పు॥ ఇది తుమ్మెదకును, అమ్ములకును పేరు

మహాశఙ్ఖో నిధౌ సఙ్ఖ్యాప్రభేదే మానుషాస్థిని.

మహాశంఖః—॥పు॥ ఇది నిధికిని, సంఖ్యావిశేషమునకున ష్యుల నొసటియెముకకును, మఱియుఁ శంఖమునకును పే

ద్విజదేవా వగ్నిముఖౌ భల్లాతేఽగ్నిముఖీ స్త్రియాం,

అగ్నిముఖః—॥పు॥ ఇది దేవతలకును, బ్రాహ్మణులకు గునపుడు ॥పు॥ జీడిమ్రానికి పేరగునపుడు, అగ్నిముఖీ ॥స్త్రీ

విశాల్యా లాఙ్గలీ చాగ్నిశిఖా క్లీబే తు కుఙ్కుమే.

అగ్నిశిఖా - ఇది వెన్నెదురుకూరకును, తరిగొప్పి నకును పేరగునపుడు ॥స్త్రీ॥ కుంకుమకు పేరగునపుడు ॥న॥

ఇతి ఖాంతాః.

ఖాంతపదవర్గము ముగిసెను.

అపవర్గః క్రియాముక్త్యోః
క్రియాసాధ్యఫలాగమే,
ఉపరాగః పరీవాదే సో
మసూర్యగ్రహేఽపిచ.
శాపాఽఽక్రోశ తిరస్కారే
ష్వభిషఙ్గో
థ రూపకే, వృకేఽపీహా
మృగస్స్యాత్తు
సంప్రయోగః కృతేఽన్వయే
ఇతి గాన్తాః

---

మలిమ్లుచో వాయుంచోరౌ
ఇతి చాన్తాః.

---

గ్రహరాజోఽర్క చన్ద్ర
యోః,
భరద్వాజో మునౌ ద్రో
ణే వ్యాఘ్రాటేఽ
థ యుంధిష్ఠిరే. ౨౮. య
మే బుద్ధే ధర్మరాజోఽ
నుజశూద్రౌ జఘన్యజౌ,
రాజరాజః కుబేరేఽపి
ద్విజరాజః ఖగేశ్వరే. ౨౯.
చన్ద్రేఽపి
భృఙ్గరాజ స్స్యా ద్భృ
ఙ్గధూమ్యాటమార్కవాః,
ఇతి జాన్తాః.

---

ప్రత్యాఖ్యాతే ప్రేషితే చ
ప్రతిసృష్ట స్త్రిలిఙ్గకః. ౩౦.
శిపివిష్టో మహాదేవే ఖలతౌ

అపవర్గః - ॥పు॥ ఇది క్రియకును, ముక్తికిని, క్రియాసాధ్యమైన ఫలప్రాప్తికిని పేరు.

ఉపరాగః - ॥పు॥ ఇది అపవాదమునకును, చంద్రసూర్యగ్రహణములకును పేరు.

అభిషంగః-॥పు॥ ఇది శాపమునకును, తిట్టుటకును, తిరస్కారమునకును పేరు.

ఈహామృగః ॥పు॥ ఇది నాటకభేదమునకును, తోఁడేటికిని పేరు.

సంప్రయోగః-॥పు॥ఇది క్రియకును, అన్వయమునకును పేరు.

గాంతపదవర్గము ముగిసెను.

---

మలిమ్లుచః - ॥పు॥ ఇది వాయువునకును, దొంగకును పేరు.

చాంతపదవర్గము ముగిసెను.

---

గ్రహరాజః - ॥పు॥ ఇది సూర్యునికిని, చంద్రునికిని పేరు.

భరద్వాజః - ॥పు॥ ఇది భరద్వాజమునికిని, ద్రోణాచార్యునకును, ఏట్రింతకును పేరు.

ధర్మరాజః - ॥పు॥ ఇది యుంధిష్ఠిరునకును, యమునికిని, బుద్ధదేవునికిని పేరు.

జఘన్యజః - ॥పు॥ ఇది తమ్మునికిని, శూద్రునికిని పేరు.

రాజరాజః - ॥పు॥ ఇది కుబేరునకుు, అపిశబ్దమువలన సార్వభౌమునకును పేరు.

ద్విజరాజః - ॥పు॥ గరుత్మంతునకును, చంద్రునకును, అపిశబ్దమువలన బ్రాహ్మణశ్రేష్ఠునకును పేరు.

భృంగరాజః - ॥పు॥ ఇది తుమ్మెదకును, గూఁకటిమూఁగకును, పక్షికిని, గుంటగలగరకును పేరు.

జాంతపదవర్గము ముగిసెను.

---

ప్రతిసృష్టః - ॥త్రి॥ ఇది తిరస్కరింపఁబడినవానికిని, పంపఁబడినవానికిని పేరు.

శిపివిష్టః-॥పు॥ ఇది ఈశ్వరునికిని, బట్టతలవానికిని, కుష్ఠరోగ

దుష్టచర్మణి,
కరహాటః పద్మకన్దే పు
ష్పభేదే ద్రుమాన్తరే. ౨౭
ఖఞ్జరీటః ఖఞ్జనే స్యా
దసిధారావ్రతస్థితే,
బలిపుష్టౌ బకధ్వాంక్షౌ
ఇతి టాన్తాః.

---

కలకణ్ఠస్తు కోకిలే. ౨౮
హంసే పారావతే చాపి
త్రిషు త్వేష కలస్వరే,
స్యాజ్జమ్బీరే కపిత్థే చ
రసే దన్తశఠః పుమాన్.
ఆమ్లే త్రి ష్వామ్లలోణ్యాం
స్త్రీ
నీలకంఠౌ శిఖీశ్వరౌ,
ఇతి ఠాంతాః.

---

సమారూఢా త్యధికయో
రత్యారూఢ స్త్రీలిఙ్గకః.
ఇతి ఢాంతాః.

---

కౌస్తుభేఽశ్వగళావర్తే శివే
దేవమణిః పుమాన్,
శఙ్కుకర్ణో గర్దభే స్యా
దుష్ట్రేఽప్య
థ సమీరణః. ౩౧. ఫణి
ర్జకే మారుతే స్యా
దథ నీలీవిశల్యయోః, మధు
పర్ణీ
సాలపర్ణీ స్థిరాఖ్యాం శ్వేత
చన్దనే. ౩౮

పువానికిని పేరు.

కరహాటః - ॥పు॥ ఇది తామరదుంపకును, పుష్పము
వృక్షభేదమునకును పేరు.

ఖంజరీటః - ॥పు॥ ఇది కాటుకపిట్టకును, కత్తివాద
యుగ్రవ్రతశీలునకును పేరు.

బలిపుష్టః - ॥పు॥ ఇది కొంగకును, కాకికిని పేరు.

టాంతపదవర్గము ముగిసెను.

---

కలకంఠః - ఇది కోకిలకును, హంసకును, పావురమునకును
గునపుడు ॥పు॥ ఇంపైన కంఠధ్వనిగలవానికి పేరగునపుడు

దంతశఠః - ఇది నిమ్మచెట్టునకును, వెలగచెట్టునకును
సునకును పేరగునపుడు ॥పు॥ పులుపైనదానికి పేరగు
॥త్రి॥ పులిచింతకు పేరగునపుడు ॥స్త్రీ॥

నీలకంఠః - ॥పు॥ ఇది నెమలికిని, శివునికిని పేరు.

ఠాంతపదవర్గము ముగిసెను.

---

అత్యారూఢః - ॥త్రి॥ ఇది ఎక్కినదానికిని, మిక్కి
క్కువైనవానికిని పేరు.

ఢాంతపదవర్గము ముగిసెను.

---

దేవమణిః ॥పు॥ ఇది కౌస్తుభమణికిని, గుఱ్ఱము మెడ
సుడికిని, శివునికిని పేరు.

శంకుకర్ణః - ॥పు॥ ఇది గాడిదకును, ఒంటెకును, అపి
చేత నొకరాక్షసునకును పేరు.

సమీరణః - ॥పు॥ ఇది మరువమునకును, గాలికిని పే

మధుపర్ణీ - ॥స్త్రీ॥ ఇది నీలిచెట్టునకును, వెన్నవెదురుకూరకును

సాలపర్ణీ - ॥స్త్రీ॥ ఇది ముయ్యాకుపొన్నకును, తెల్లగంధ
కును పేరు.

దాక్షాయణీ భవానీ భూ
రశ్విన్యాద్యాశ్చ తారకాః,
అసమ్బాధచమూగత్యాం
సంసారే పురనిర్గమే. 33
ఘణ్టాపథే సంసరణ
మథోద్ధరణ ముద్ధృతౌ,
భుక్తోజ్ఝితే నిస్సరణ ము
పాయే నిర్గమేఽపి చ. 34
పారాయణం పారగతా
వంకుశస్య చ బన్ధనే,
శబ్దశాస్త్రే వ్యాకరణం జ్యా
టంకారే స్ఫుటీకృతౌ. 35
స్యాదస్త్రియాం వారవా
ణం కూర్పాసే కవచేఽపి చ,
నారాయణీ రమాగౌర్యో
శ్శతావర్యాం హరౌ తు నా.
నిరూపణం తు న పుమాన్
విలోచనవికారయోః,
పరాయణం క్లీబ మిష్టాశ్ర
యయో స్తత్పరే త్రిషు.
కార్త్స్న్యేఽప్య
ర్థో కామ్యదానే నిషేధే
చ ప్రదారణమ్,
విదారణం స్యా త్సమరే
ద్వైధీభావే విడమ్బనే. 36
ఇతి ణాన్తాః.

---

ఉదాస్థిత శ్చరే ద్వాఃస్థే
సమాఘాతో వధే రణే,
పరివర్తో వినిమయే స్యా
త్కల్పాన్తే పరిభ్రమే. 37
నంద్యావర్తస్తు భవనభేదే

దాక్షాయణీ - ॥స్త్రీ॥ ఇది శివునిభార్యకును, భూమికిని, అశ్విని మొదలైన యిరువదియేడునక్షత్రములకును పేరు.

సంసరణమ్-॥న॥ ఇది సంకటములేనట్టులు సేన నడచుటకును సంసారమునకును, పట్టణము వెడలుటకును, పదియిండ్లపట్టుగల రాజమార్గమునకును పేరు.

ఉద్ధరణమ్-॥న॥ ఇది ఎత్తుటకు పేరు.

నిస్సరణమ్-॥న॥ ఇది అనుభవించి విడిచినదానికిని, ఉపాయమునకును, బయలువెడలుటకును పేరు.

పారాయణమ్-॥న॥ ఇది తుదను పొందుటకును, అంకుశము జారకుండునట్టులు కట్టుత్రాటికిని పేరు.

వ్యాకరణమ్-॥న॥ ఇది శబ్దశాస్త్రమునకును, నారిమ్రోతకును, ప్రకాశపఱచుటకును పేరు.

వారవాణమ్-॥పున॥ ఇది రవికెకును, జోడునకును పేరు.

నారాయణీ-॥స్త్రీ॥ ఇది లక్ష్మికిని, గౌరికిని, చల్లగడ్డకును పేరు. విష్ణువునకు పేరైనపుడు నారాయణః ॥పు॥

నిరూపణమ్-॥పున॥ఇది నేత్రమునకును, వికారమునకును పేరు.

పరాయణమ్-ఇది యిష్టమునకును, ఆశ్రయమునకును పేరైనపుడు॥న॥ ఒకయర్థమునందుఁ దగిలిన మనస్సుగలవానికిని, అంతయు ననునర్థమునకును పేరైనపుడు ॥త్రి॥

ప్రదారణమ్-॥న॥ ఇది యాచకుఁడు కోరినవస్తువును తానొక్క ఫలము నపేక్షించి యిచ్చుటకును, నిషేధమునకును పేరు.

విదారణమ్-॥న॥ ఇది యుద్ధమునకును, పగుల్చుటకును, అనుకరించుటకును పేరు.

ణాంతపదవర్గము ముగిసెను.

---

ఉదాస్థితః-॥పు॥ఇది వేగులవానికిని,ద్వారపాలకునకును పేరు.

సమాఘాతః-॥పు॥ ఇది వధకును, యుద్ధమునకును పేరు.

పరివర్తః- ॥పు॥ ఇది ఒక వస్తువు నిచ్చి మఱియొకవస్తువును మార్చుటకును, ప్రళయకాలమునకును, తిరుగుటకును పేరు.

నంద్యావర్తః-॥పు॥ ఇది రచనాభేదమువలనఁ జేయఁబడిన

తగరపాదపే,
నాగదన్తో ద్విపరదే గృహ
నిర్గమదారుణి. ౪౦
నదీకాన్తస్తు నిచులే సిన్ధు
వారసముద్రయోః,
త్వష్టృరాజాగ్ని జామాతృ
బ్రహ్మార్కేషు ప్రజాపతిః.
అపుష్పఫలవద్వృక్షే వృక్ష
మాత్రే వనస్పతిః,
అపి శర్వాభ్ద పశుపతి
రపి లక్ష్మీపతిర్నృపే. ౪౧
అపి శ్రీదే ధనపతి
రపి సేనాపతి ర్గుహే,
ఉత్పాతేఽగ్నౌ ధూమకేతు
ర్విశ్వగోప్తాహరీన్ద్రయోః.
చోరోలూకౌ దివాభీతౌ
హాసంత్యాం తినిశద్రుమే,
అతిముక్తః
పారిజాతో పారిభద్ర సుర
ద్రుమాః. ౪౪
స్త్రియా మపచితిః పూజా
నిష్కృత్యో స్సంఙ్ఘ యేఽ
వ్యయే,
అథ హైమవతీ గఙ్గా
పథ్యా శుక్లవచాఽభ్యమాః.
ప్రతిమాయాం ప్రతికృతిః
పూజన ప్రతికారయోః,
ప్రత్యాప్తి ర్గౌరవం బుద్ధిః
ప్రాగల్భ్యం ప్రతిపత్తయః.
అనుజ్ఞా స్యా దనుమతిః

రాజగృహావిశేషమునకును, నందివర్ధనపుచెట్టునకును పేరు.

నాగదన్తః-॥పు॥ ఇది ఏనుఁగుదంతమునకును, గృహద్వా సాధనమైన దారుభేదమునకును పేరు.

నదీకాన్తః-॥పు॥ ఇది పనసచెట్టునకును, వావిలిచెట్టునకును సముద్రమునకును పేరు.

ప్రజాపతిః-॥పు॥ ఇది వడ్లవానికిని, రాజునకును, అగ్నికిని అల్లునికిని, బ్రహ్మకును, సూర్యునికిని పేరు.

వనస్పతిః- ॥పు॥ ఇది పుష్పఫలములు లేనివృక్షమునకును వృక్షసామాన్యమునకును పేరు. [రికిని పేరు

పశుపతిః-॥పు॥ ఇది శివునికిని, అపిశబ్దముచేత పశువుల మే

లక్ష్మీపతిః-॥పు॥ ఇది రాజునకును, అపిశబ్దముచేత విష్ణువు కును పేరు. [పేరు

ధనపతిః-॥పు॥ ఇది కుబేరునకును, అపిశబ్దముచేత ధనికునకు

సేనాపతిః-॥పు॥ ఇది కుమారస్వామికిని, అపిశబ్దముచేత సేన నాయకునకును పేరు.

ధూమకేతుః-॥పు॥ ఇది ఉత్పాతమునకును, అగ్నికిని పేరు

విశ్వగోప్తా-॥ఋ-పు॥ ఇది విష్ణువునకును, ఇంద్రునకును పేరు

దివాభీతః-॥పు॥ ఇది చోరునకును, గుడ్లగూబకును పేరు.

అతిముక్తః-॥పు॥ఇది బండిగురివిందకును, నెమ్మిచెట్టునకును పేరు

పారిజాతః-॥పు॥ ఇది పారిజాతవృక్షమునకును, కల్పవృక్షమ నకును పేరు.

అపచితిః-॥స్త్రీ॥ ఇది పూజకును, ప్రాయశ్చిత్తమునకును, ఇయించుటకును, వ్యయమునకును పేరు.

హైమవతీ- ॥స్త్రీ॥ ఇది గంగకును, ఉసిరికచెట్టునకును, తె వసకును, పార్వతికిని పేరు.

ప్రతికృతిః-॥స్త్రీ॥ ఇది ప్రతిమకును, పూజించుటకును, ప్ర క్రియ చేయుటకును పేరు.

ప్రతిపత్తిః-॥స్త్రీ॥ ఇది పోయినదాని మరలఁ బొందుటకును గౌరవమునకును, బుద్ధికిని, ప్రౌఢమకును పేరు.

అనుమతిః-॥స్త్రీ॥ ఇది అనుజ్ఞకును, ఒకకళ తక్కువైనచంద్రు

కేన్దుపూర్ణిమా,
మ్ఖ్యం శతావర్యా
ప్రోక్తాఽ
షణే. ౪౭. ప్రార్థనే
స్సాస్త్రి
ద్రాన్తా దురాలభా,

ృంతా తు పాటలా
ల్యపి. ౪౮
హ్యాతం యుద్ధమాత్రే
ంద్ధేఽపి తద్భవేత్,
హితం త్వతిభయం
నపేక్షి చ. ౪౯
హితోఽగ్నావుత్పా
త్రిష్వాపనివేశితే,

వతోఽభ్రమా తజ్జే
నాగరఙ్గకే. ౫౦.
ర్ఘే న్ద్రచాపే తు క్లీబ
ావతీ తటిత్,
ౌతం రూప్యహే
క్లీబం త్రిషు కల
౫౧

యన్తో ధ్వజే శక్రప్రా
షణ్ముఖే చ నా,
యన్తీ పతాకాయాం
ీ కేశవస్రజోః. ౫౨
కృతి ర్నిరాసే స్త్రీ
్యయరహితే త్రిషు,
రే త్రిష్వవ
సమాప్తేనిశ్చితేఽపిచ.

తోఁగూడిన పున్నమకును పేరు.

ఋశ్యప్రోక్తా - ॥సీ॥ ఇది దురదగొండికిని, చల్లగడ్డకును పేరు.

అభిశస్తిః-॥సీ॥ ఇది దూషణకును, యాచనకును పేరు.

సముద్రాంతా-॥సీ॥ ఇది తీఁటకసిందకును, ప్రత్తిచెట్టునకును పేరు.

కృష్ణవృంతా-॥సీ॥ ఇది కలిగొట్టుచెట్టునకును, కారుమినుమునకును పేరు.

ప్రాణిద్యూతమ్-॥న॥ ఇది యుద్ధసామాన్యమునకును, కోడిపందెము మొదలైనవానికిని పేరు.

అత్యాహితమ్-॥న॥ ఇది మిక్కిలిభయమునకును, ప్రాణాశలేని సాహకర్మకును పేరు.

ఉపాహితః-ఇది అగ్నికిని, ఉత్పాతమునకును పేరగునపుడు, ॥పు॥ మఱియొకపదార్థముతోఁ గూర్పఁబడినదానికిఁ బేరగునపుడు ॥త్రి॥

ఐరావతః-ఇది ఇంద్రవాహనమైన యేనుఁగునకును, నిమ్మచెట్టునకును, కాకినేరేడునకును పేరైనపుడు ॥పు॥ వంకరలేక దీర్ఘమైన యింద్రధనుస్సునకుఁ బేరైనపుడు ॥న॥

ఐరావతీ-॥సీ॥ ఇది మెఱుపునకు పేరు.

కలధౌతమ్-ఇది వెండికిని, బంగారమునకును పేరగునపుడు ॥న॥ మధురధ్వనిగలదానికి పేరగునపుడు ॥త్రి॥

వైజయంతః-॥పు॥ ఇది ధ్వజమునకును, ఇంద్రుని మేడకును, కుమారస్వామికిని పేరు.

వైజయంతీ-॥సీ॥ ఇగి టెక్కెమునకును, తక్కిలిచెట్టునకును, విష్ణుపుయొక్క పుష్పమాలికకును పేరు.

నిరాకృతిః-ఇది తిరస్కారమునకుఁ బేరగునపుడు ॥సీ॥ వేదము చదువనివానికిఁ బేరగునపుడు ॥త్రి॥

ఉత్తరే=ఇది మొదలు చెప్పఁగల తాంతశబ్దము లన్నియుం త్రిషు=మూఁడులింగములయందు వర్తించును.

అవసితమ్-॥త్రి॥ ఇది సమాప్తిని పొందినదానికిని, నిశ్చయింప

అవదాత స్సితే పీతే శ్రవ
శుద్ధిమత్యపి,
అన్తర్గతం మధ్యగతే వి
ృతేఽప్య
థ గర్హితే. ౫౮. ముహు
ష్టేఽపగీతం స్యా
త్పరిక్షిప్తం చ ధిక్కృతే,
ేషితే చా
భిజాతస్తు కులీనన్యాయ్య
ణ్డితాః. ౫౯
అభినీత స్సంస్కృతే చ
న్యాయ్యామర్షవతో రపి,
అధిక్షిప్తస్తు నిహితే భర్త్సి
ప్రేషితేఽపి చ. ౬౦
అపధ్వస్తాః పరిత్యక్త పరి
ూర్ణితనిన్దితాః,
ప్రతిజ్ఞాతే వినిహితే సమా
స్థే సమాహితః. ౬౧
పురస్కృతో రిపుగ్రస్తే
ాకృతేఽగ్రీకృతేఽర్చితే,
ఉపరక్తస్తు దుఃఖార్తేరా
హుగ్రస్తేన్దుసూర్యయోః.
పరిప్రాప్తే పరివృతే జ్ఞాతే
రిగతం భవేత్,
ఉద్గ్రాహిత ముపన్యస్తే
బద్ధే గ్రాహితేఽపిచ. ౬౨
దిగ్ధవృద్ధా వుపచితౌ
నిర్గతేఽపి సముద్గతః,
ఉత్కీర్ణ తనూకృతయో

బడినదానికిని పేరు.

అవదాతః-॥త్రి॥ ఇది తెల్లనివస్తువునకును, పచ్చనివస్తువు కును, శ్రేష్ఠమైనదానికిని పరిశుద్ధిగలదానికిని పేరు.

అంతర్గతమ్-॥త్రి॥ ఇది మధ్యమును పొందినదానికిని మఱః బడినదానికిని పేరు.

అపగీతమ్-॥త్రి॥ ఇది పలుమాఱుఁజూడఁబడినదానికిని, నింద పఁబడినదానికిని పేరు.

పరిక్షిప్తమ్-॥త్రి॥ ఇది ధిక్కరింపఁబడినదానికిని, పంపఁబడి దానికిని పేరు.

అభిజాతః-॥త్రి॥ ఇది కులముగలవానికిని, న్యాయవంతునికి పండితునకును పేరు.

అభినీతః-॥త్రి॥ లెస్సగాఁజేయఁబడినదానికిని, యోగ్యమై దానికిని, కోపముగలవానికిని పేరు.

అధిక్షిప్తః-॥త్రి॥ ఇది ఉంచఁబడినదానికిని, బెదరింపఁబ వానికిని, పంపఁబడినవానికిని పేరు.

అపధ్వస్తః-॥త్రి॥ ఇది విడువఁబడినదానికిని, పొడిచేం బడినదానికిని, నిందింపఁబడినదానికిని పేరు.

సమాహితః-॥త్రి॥ ఇది ప్రతిజ్ఞచేయఁబడినదానికిని, లెస్స నుంచఁబడినదానికిని, సమాధియందున్నదానికిని పేరు.

పురస్కృతః-॥త్రి॥ ఇది శత్రువుచేతపట్టువడినదానికిని, సీ రింపఁబడినదానికిని, ఎదురుగానుంచఁబడినదానికిని, పూజిం బడినదానికిని పేరు.

ఉపరక్తః-॥త్రి॥ ఇది దుఃఖముచేత పీడింపఁబడినదాని రాహువుచేత పట్టుపడిన చంద్రసూర్యులకును పేరు.

పరిగతమ్-॥త్రి॥ఇది అంతటపొందఁబడినదానికిని, చుట్టఁబ దానికిని, తెలియఁబడినదానికిని పేరు.

ఉద్గ్రాహితమ్-॥త్రి॥ ఇది ఉపన్యసింపఁబడినదానికిని, క బడినదానికిని, గ్రహింపఁజేయఁబడినదానికిని పేరు.

ఉపచితః-॥త్రి॥ ఇది పూయఁబడినదానికిని, వృద్ధునికిని జే

సముద్గతః-త్రి ఇది బయలువెడలినవానికిని, అపిశబ్దమున లేచినవానికిని పేరు.

ఉల్లిఖితమ్-॥త్రి॥ఇది గీఱఁబడినదానికిని, సూక్ష్మముగాఁజే

ణితం
ణిహితంతు విన్యస్తే,
తేఽ
పరిస్ఖలితే ప్రతిరుద్ధే
తిహతం ద్విషే.
ఇతి తాన్తాః.

బడినదానికిని పేరు.

ప్రణిహితమ్-॥త్రి॥ ఇది ఉంచఁబడినదానికిని, ధ్యానము చేయఁబడినదానికిని పేరు.

ప్రతిహతమ్-॥త్రి॥ ఇది జాఱినవానికిని, అడ్డగింపఁబడిన దానికిని, ద్వేషింపఁబడినదానికిని పేరు.

తాంతపదవర్గము ముగిసెను.

---

నప్రస్థో మధుష్ఠీలే తృ
యాశ్రమవర్తిని. ౬౧.
సకే
ాణనాథ స్తు యమే
ణేశ్వరేఽపి చ,
ానీకస్థో రాజరక్షీ గజ
ణదక్షిణః. ౬౨
చతుష్పథం చతుర్మార్గ
మే బ్రాహ్మణే తు నా,
దశమీస్థో నష్టబీజే స్థవి
చ త్రిలిఙ్గకః. ౬౩
ఇతి థాంతాః.

వానప్రస్థః-॥పు॥ ఇది నీరిప్పమ్రానికిని, తృతీయాశ్రమమున నున్నవానికిని, మోదుగుచెట్టునకును పేరు.

ప్రాణనాథః-॥పు॥ ఇది యమునికిని, ప్రాణేశ్వరునికిని పేరు.

అనీకస్థః-॥పు॥ ఇది రాజుయొక్క యంగరక్షకునికిని, ఏనుఁగుల రక్షింప సమర్థునికిని పేరు.

చతుష్పథమ్-ఇది నాలుగు త్రోవలుగూడు స్థలమునకు పేరగునపుడు ॥న॥ బ్రాహ్మణునకును పేరగునపుడు ॥పు॥

దశమీస్థః-॥త్రి॥ ఇది వీర్యమునశించినవానికిని, వృద్ధునికిని పేరు.

థాంతపదవర్గము ముగిసెను.

---

చక్రపాదౌ రథగజౌ
వహ్ని న్ద్వర్కా స్తమో
దః,
కురువిందాః పద్మరాగ హి
ళాదర్శముస్తకాః. ౬౪
జనే గ్రామే జనపదోఽ
పవాదో గర్హణాజ్ఞయోః,
పరీవాద స్తు నిర్వాదే వీ
ావాదనసాధనే. ౬౫
అభిష్యన్దో నేత్రరోగేఽ

ష్యభిమర్దో రణేఽపి చ,

చక్రపాదః-॥పు॥ ఇది రథమునకును, గజమునకును పేరు.

తమోనుత్-॥ద్-పు॥ ఇది అగ్నికిని, చంద్రునికిని, సూర్యునికిని పేరు.

కురువిందః-॥పు॥ ఇది కెంపునకును, ఇంగువకును, అద్దమునకును, తుంగగడ్డకును పేరు.

జనపదః-॥పు॥ ఇది జనమునకును, గ్రామమునకును పేరు.

అపవాదః-॥పు॥ ఇది నిందకును, ఆజ్ఞకును నామము.

పరీవాదః-॥పు॥ ఇది నిందకును, వీణనువాయించుకోడుకునకును నామము.

అభిష్యందః-॥పు॥ ఇది నేత్రరోగమునకును, అధికశబ్దమువలన నంతటజాఱుటకును నామము. [చుటకును నామము.

అభిమర్దః-॥పు॥ ఇది యుద్ధమునకును, అధికశబ్దముచేత మర్దిం

అజమోదా తూగ్రగన్ధా
నిర్యాస శ్శాల్మలేఽపి చ.
భవే త్కోకనదం రక్త
పద్మే రక్తోత్పలేఽప్య
థ, శరభే నా హేమ్ని
శారిఫలకేఽష్టాపదోఽస్త్రి
యామ్. ౬౭

గఙ్గా విష్ణుపదీ క్లీబే త్వ
యం వ్యోమ సముద్రయోః,
అథ ప్రగల్భవిదుషో ర్వా
చ్యలిఙ్గో విశారదః. ౬౮

ఇతి దాన్తాః.

---

దోషోత్పాదేఽనుబన్ధ
స్స్యా త్ప్రకృత స్యానువ
ర్తనే, ప్రకృత్యాదే ర్నశ్వ
రాంశే శిశౌ ముఖ్యాను
యాయిని. ౬౯

అవరోధో రాజగృహే
శుద్ధాన్తేఽప్యవరోధనే,
భవే దతివిషా శుణ్ఠీ లశు
నేషు మహౌషధమ్. ౭౦

అనిరుద్ధ ఉషానాథే చరే
నాఽనర్గళే త్రిషు,
వసాజమోదయో రుగ్ర
గన్ధా స్త్రీ లశునే తు నా.
ఉపలబ్ధి స్త్రియాం ప్రా
ప్తౌ మనీషాయా
మథ త్రిషు, అవష్టబ్ధం
స్యా దదూరే సమాక్రాన్తే
ఽవలమ్బనే. ౭౧

సమున్నద్ధా స్సముద్బుద్ధ

అజమోదా-॥స్త్రీ॥ ఇది ఓమమునకును, బూరుగుచెట్టుజ కును నామము.

కోకనదమ్-॥న॥ ఇది ఎఱ్ఱకమలములకును, ఎఱ్ఱకలువక నామము.

అష్టాపదః-॥ప్న్న॥ ఇది శరభమృగమునకును, బంగారము ను, జూదమాడుపలకకును నామము.

విష్ణుపదీ-ఇది గంగకుఁ బేరగునపుడు ॥స్త్రీ॥ ఆకాశమునకు సముద్రమునకును బేరగునపుడు-విష్ణుపదమ్ ॥న॥

విశారదః-ఇది ప్రౌఢునకును, విద్వాంసునికిని పేరగునపు విశేష్యలింగము.

దాంతపదవర్గము ముగిసెను.

---

అనుబంధః-॥పు॥ ఇది దోషమును సంపాదించుటకును, ప్రకృతమైనది యొడలెగక యనువర్తించుటకును, ప్రకృతిప్రత్యయ దులయందు నశించిపోవు నక్షరమునకును, శిశువునకును, ముఖ లైన తండ్రి మొదలైనవారి ననుసరించినవానికిని నామము.

అవరోధః-॥పు॥ ఇది రాజగృహమునకును, అంతఃపురమ కును, నిరోధించుటకును నామము.

మహౌషధమ్-॥న॥ ఇది అతివసకును, శొంఠికిని, వెల్లు గడ్డకును నామము.

అనిరుద్ధః-ఇది అనిరుద్ధునికిని, వేగులవానికిని బేరగునపు ॥పు॥ అడ్డములేనిదానికిఁ బేరగునపుడు ॥త్రి॥

ఉగ్రగంధా-ఇది వసకును, ఓమమునకును బేరగునపుడు ॥స్త్రీ॥ వెల్లుల్లికిఁ బేరగునపుడు ॥పు॥

ఉపలబ్ధిః-॥స్త్రీ॥ ఇది పొందుటకును, బుద్ధికిని నామము.

అవష్టబ్ధమ్-॥త్రి॥ ఇది సమీపమైనదానికిని, ఆక్రమింప బడినదానికిని, పట్టునకును నామము.

సమున్నద్ధః॥త్రి॥ ఇది పుట్టినదానికిని, పండితుండు కాక

పణ్డితంమన్య గర్వితౌ,

తాను పండితుఁడని తలఁచువానికిని, గర్వముగలవానికిని పేరు.

ఇతి ధాంతాః.

ధాంతపదవర్గము ముగిసెను.

---

స్యా ద్వర్ధమాన పీరణ్డే శరావే భూషణేఽపిచ. ౭౩

వర్ధమానః-॥పు॥ ఇది ఆముదపుచెట్టునకును, మూఁకుడునకును, భూషణవిశేషమునకును నామము.

అభిమానో గర్వబుద్ధ్యో ర్హింసా ప్రణయయోరపి,

అభిమానః -॥పు॥ ఇది ధనాదులచేతఁ గలిగినగర్వమునకును, బుద్ధికిని, హింసకును, ప్రార్థనకును నామము.

ప్రతియత్నస్తు సంస్కార ఉపగ్రహణలిప్సయోః ౭౪

ప్రతియత్నః-॥పు॥ ఇది సంస్కరించుటకును, చెఱపట్టుటకును, అభిలాషకును నామము.

పారావతే మయూరేచ కోకిలే చ కలధ్వనిః,

కలధ్వనిః-॥పు॥ ఇది పావురమునకును, నెమలికిని, కోకిలకును నామము.

ధాతృస్మరా దాత్మయోనీ

ఆత్మయోనిః-॥పు॥ ఇది బ్రహ్మకును, మన్మథునికిని పేరు.

మూర్ఖనీచౌ పృథగ్జనౌ.

పృథగ్జనః ॥పు॥ ఇది మూర్ఖునకును, నీచునకును నామము.

జన్మభూమా వభిజనో విఖ్యాతా వన్వయే చ సః,

అభిజనః-॥పు॥ ఇది జన్మభూమికిని, ప్రసిద్ధికిని, కులమునకును చకారమువలన కులాగతములైన ధ్వజాదులకును నామము.

వహ్నౌ భానౌ చిత్రభానూ

చిత్రభానుః-॥పు॥ ఇది అగ్నికిని, సూర్యునకును నామము.

వహ్నీన్ద్వర్కా విరోచనాః. ౭౫

విరోచనః -॥పు॥ ఇది అగ్నికిని, చంద్రునకును, సూర్యునకును నామము.

పుణ్యజన స్సుజనే స్యా ద్రక్షసి యక్షేఽథ

పుణ్యజనః -॥పు॥ ఇది సుజనునికిని, రాక్షసునకును, యక్షునకును నామము.

గర్జితే మేఘే, స్తనయిత్ను

స్తనయిత్నుః -॥పు॥ ఇది గర్జనమునకును, మేఘమునకును నామము.

రనూచాన స్స్వవినీతే సాఙ్గవేదజ్ఞే. ౭౬

అనూచానః-॥పు॥ ఇది మిక్కిలి వినయవంతునికిని, వ్యాకరణాదిషడంగములతోడ వేదములఁ జదివినవానికిని నామము.

గుఞ్జాయామాఢ్యా శిఖండిన్యా

శిఖండినీ -॥స్త్రీ॥ ఇది గురిగింజకును, అడవిమొల్లకును పేరు.

సౌదామ న్యప్సరస్యపి,

[కును నామము
సౌదామనీ-॥స్త్రీ॥ ఇది అప్సరసకును, అపిశబ్దముచేత మెఱుపు

ఆతఞ్చనం ప్రతీవాప జవనాప్యాయనార్థకమ్ ౭౭

ఆతంచనమ్-॥న॥ ఇది పాలు తోడుపెట్టుటకును, వేగమునకును, తృప్తిని గలుగఁజేయుటకును పేరు.

సాధనే తోషణే ప్రాప్తా వారాధన

ఆరాధనమ్ -॥న॥ ఇది సాధనమునకును, సంతోషపెట్టుటకును, పొందుటకును పేరు.

మ థాంశుకే, పిధానేఽ
ప్యాచ్ఛాదనం స్యా
త్కార్య హేత్వోః ప్ర
యోజనమ్. ౭౯

ఆస్కన్దనం తిరస్కారే
సంశోషణయో ర్యుధి,
ప్రతిమానం ప్రతిచ్ఛాయా
గజదంతాన్తరాళయోః.
౮౦

అనుష్ఠానం పుః ప్రభావ
క్రే ష్వధ్యాసనేఽపి చ,
జన్మోద్గత్యో రుత్పతన
మథాభివ్యాప్తి మూర్ఛ
నాః. ౮౧ సమ్మూర్ఛనం
సముత్థాన ముద్యమే రోగ
యే,
నిర్యాతనం వైరశుద్ధౌ దా
న్యాసధనార్పణే. ౮౨
కాంక్షాయా మాకలనం
నా జ్ఞాన బన్ధయోః, స
హే చా

దానం తు వృత్తకర్మణి
నే. ౮౩
ర్భ_ర్త్సన మలక్ష్మేఽపి
తిదృష్ట్యోర్నిశామనమ్,
పాసనం శరాభ్యాసే
సా సేవనయో రపి. ౮౪
తే కంపే నిధువనమ్
శ్యై దుద్వర్తన ముద్గమే,
పనే
థ వధే సమాప్తౌ చ స
నమ్. ౮౫

ఆచ్ఛాదనమ్.॥న॥ ఇది వస్త్రమునకును, కప్పుటకును

ప్రయోజనమ్.॥న॥ఇది కార్యమునకును, హేతువునకు

ఆస్కందనమ్ - ॥న॥ ఇది తిరస్కారమునకును, గః
కును, ఎండుటకును, యుద్ధమునకును పేరు.

ప్రతిమానమ్ - ॥న॥ ఇది దేవతామూర్తులకు సమము
దులచేఁ జేయఁబడిన విగ్రహాదులకును, ఏనుఁగుదంతము
దేశమునకును పేరు.

అనుష్ఠానమ్.॥న॥ ఇది పట్టణమునకును, ప్రభావము
బండికంటికిని, ఆక్రమించుటకును పేరు.

ఉత్పతనమ్.॥న॥ ఇది పుట్టుటకును, ఎగురుటకును పే

సమ్మూర్ఛనమ్.॥న॥ ఇది అంతట వ్యాపించుటకును,
మఱచుటకును పేరు.

సముత్థానమ్.॥న॥ ఇది ఉద్యోగమునకును, రోగనిశ్చ
నకును పేరు.

నిర్యాతనమ్.॥న॥ ఇది పగసాధించుటకును, దానము
దాఁచిపెట్టినధనమును మరలనిచ్చుటకును పేరు.

ఆకలనమ్.॥న॥ ఇది ఆక్షేపమునకును, లెక్కపెట్టు
నకును, కట్టుటకును, కూటమికిని పేరు.

అపదానమ్.॥న॥ ఇది పూర్వము నడిచిన సద్వ్యా
నకును, ఖండించుటకును పేరు. [టకును

నిర్భర్త్సనమ్.॥న॥ ఇది లక్కకును, అపశబ్దముచే బె

నిశామనమ్.॥న॥ ఇది వినుటకును, చూచుటకును పేరు

ఉపాసనమ్ - ॥న॥ ఇది విలువిద్య నేర్చుకొనుటకును,
పుటకును, సేవచేయుటకును పేరు.

నిధువనమ్.॥న॥ ఇది రతికిని, వణఁకుటకును పేరు.

ఉద్వర్తనమ్ - ॥న॥ ఇది తెచ్చుటకును, నలుగుపెట్టు
పేరు.

సమాపనమ్.॥న॥ ఇది వధకును, సమాప్తికిని పేరు.

ఆమ్నాయేఽపి ప్రవచనం
స్యా దాయోధన మాహవే, వధే చ
ప్రణిధానం తు సమాధి ప్రతియత్నయోః. ౧౬
యోన్యుత్పత్త్యోః ప్రజనన మథ ప్రేషణదానయోః, విసర్జనం
విహననం వధవీజనవాచకమ్. ౧౭
అభ్యాధాన మభిన్యాసే వహ్న్యర్థం చేధ్మసఙ్గ్రహే,
నిర్వాసనంతుహింసాయాం నగరాదే ర్బహిష్కృతౌ.
నిష్ఠ్యూతౌ చ నిరసనం
సంవాహన మఙ్గమర్దనేఽపి స్యాత్,
శిల్పిగృహే ష్వావేశన ముద్వాపనమపి చ హింసనే ప్రోక్తమ్. ౧౮
కాత్యాయనో వరరుచౌ మునౌ కాత్యాయనీత్యుమా, యా చార్ధవృద్ధా కాషాయ వసనా గత భర్తృకా. ౧౯
త్రిష్వవలగ్నం లగ్నే మధ్యే క్లీబం
ఘనాఘన స్త్రీవ్రన్ద్రే, వర్షుకమేఘే ఘాతుకమత్తేభేచ త్రిషు త్వయం సాన్ద్రే). ౨౦

ప్రవచనమ్-॥న॥ ఇది పలుమాఱు చదువుటకును, అపిశబ్దము చేత శ్రేష్ఠవాక్యమునకును పేరు.

ఆయోధనమ్-॥న॥ ఇది యుద్ధమునకును, చంపుటకును పేరు.

ప్రణిధానమ్-॥న॥ ఇది సమాధికిని, అభిలాషకును పేరు.

ప్రజననమ్-॥న॥ ఇది యోనికిని, ఉత్పత్తికిని పేరు.

విసర్జనమ్-॥న॥ ఇది పంపుటకును, దానమునకును పేరు.

విహననమ్-॥న॥ ఇది వధకును, విసరుటకును పేరు.

అభ్యాధానమ్-॥న॥ ఇది ఉంచుటకును, అగ్నికొఱకు సమిత్తుల సంపాదించుటకును పేరు.

నిర్వాసనమ్-॥న॥ ఇది హింసకును, పట్టణము మొదలైనవాని నుండి వెడలఁగొట్టుటకును పేరు.

నిరసనమ్-॥న॥ ఇది ఉమియుంటకును, చకారముచేత ధిక్కరించుటకును పేరు.

సంవాహనమ్-॥న॥ ఇది దేహమును పిసుకుటకును, అపిశబ్దవ చేత మోయుంటకును పేరు. [గుడిసెకును పేరు

ఆవేశనమ్-॥న॥ ఇది కంసాలకొట్టునకును, అపిశబ్దముచే

ఉద్వాపనమ్ - ॥న॥ ఇది హింసించుటకును, అపిశబ్దముచే నొకబింబమున నావాహనముచేసిన దేవతను మరల స్వస్థానమునకు మంత్రముచేత పంపుటకును పేరు.

కాత్యాయనః-॥పు॥ ఇది వరరుచికిని, కాత్యాయనముని పేరు. కాత్యాయనీ ॥స్త్రీ॥ పార్వతికిని, సగముముదిసి కావిచీరగ యున్న విధవస్త్రీకిని పేరు.

అవలగ్నమ్-ఇది చిక్కువడినదానికిఁ బేరైనపుడు ॥త్రి॥ నడుమునకుఁ బేరైనపుడు ॥న॥

ఘనాఘనః-ఇది ఇంద్రునకును, వర్షించుమేఘమునకు చంపుస్వభావముగల మదపుటేనుఁగునకును బేరైనపుడు దట్టమైనదానికి పేరైనపుడు ॥త్రి॥

శాశ్వతే త్రిషు నా బ్రహ్మ
-రీశేషు సనాతనః,
దీప్తా ప్రద్యోతనం నార్కే
మహాసేనో గుహోఽపిచ. ౯౨
ఆత్మనీన స్సుతే స్యాలే
మా నాత్మహితే త్రిషు,
విష్వక్సేనా గన్ధఫల్యాం
-తు విష్ణౌ
పథ త్రిషు. ౯౩. అభిప
న్నే ధృతే గ్రస్తేఽపరాద్ధే
క్షీణార్తయోః, విపన్నే
ప్రతిపన్నస్తు విజ్ఞాతేఽఙ్గీ
తా వపి. ౯౪
అవాచీనం విపర్యస్తం య
దక్షిణదిగ్భవమ్,
ఇతి నాన్తాః.

---

ప్రలమ్భే విరోధోక్తావ
ర్థకవచస్యపి. ౯౫. వి
లాపోఽ
లేపస్తు దూషణే గర్వ
యోః,
రివాదస్తు పర్యస్తా వాల
రే పరిచ్ఛదే. ౯౬
రిక్షేపః పరివృతౌ పాద
ర్శ్వే చ దన్తినామ్,
పతాపౌ రోగతాపౌ
వవిష్ణూ వృషాకపీ. ౯౭
ఇతి పాంతాః.

---

సనాతనః-ఇది నాశములేనిదానికి పేరైనపుడు ॥త్రి॥ బ్రహ్మకును, విష్ణువునకును, శివునికిని పేరైనపుడు ॥పు॥

ప్రద్యోతనమ్-ఇది ప్రకాశమునకు పేరైనపుడు ॥న॥ సూర్యునికిని పేరైనపుడు ॥పు॥

మహాసేనః - ॥పు॥ ఇది కుమారస్వామికి పేరు. అపిచ కాములవలన సేనావిస్తారముగలవానికి పేరైనపుడు ॥త్రి॥

ఆత్మనీనః - ఇది కుమారునికిని, భార్యతోడఁబుట్టినవానికిని బేరైనపుడు ॥పు॥ ఆత్మహితమైనదానికిని బేరైనపుడు ॥త్రి॥

విష్వక్సేనా-॥న॥ ఇది ప్రేంకణపుచెట్టునకుఁ బేరైనపుడు ॥స్త్రీ॥ విష్ణువునకుఁ బేరైనపుడు ॥పు॥

అభిపన్నః-॥త్రి॥ ఇది ధరింపఁబడినదానికిని, పట్టువడినదానికిని, అపరాధము చేసినవానికిని, సమర్థునికిని, ఆర్తునికిని, ఆపద పొందినవానికిని పేరు.

ప్రతిపన్నః-॥త్రి॥ ఇది శిల్పశాస్త్రాదులయందలి జ్ఞానమునకును, అంగీకారమునకును పేరు.

అవాచీనమ్-॥త్రి॥ ఇది విపర్యాసమైనదానికిని, దక్షిణదిక్కునఁ బుట్టినదానికిని పేరు.

నాంతపదవర్గము ముగిసెను.

---

విప్రలాపః-॥పు॥ ఇది మోసపుచ్చుటకును, విరోధవాక్కునకును, వ్యర్థవాక్కునకును పేరు.

అవలేపః-॥పు॥ ఇది దూషించుటకును, గర్వమునకును, పూయుటకును పేరు.

పరివాదః-॥పు॥ ఇది వ్యథపెట్టుటకును, నీళ్లనిలుచు పాదికిని, పరివారమునకును పేరు.

పరిక్షేపః-॥పు॥ ఇది వెలుగునకును, ఏనుఁగులయొక్క పాదపార్శ్వమునకును పేరు.

ఉపతాపః-॥పు॥ ఇది రోగమునకును, సంతాపమునకును [పేరు.

వృషాకపిః-॥పు॥ ఇది శివునికిని, విష్ణువునకును పేరు.

పాంతపదవర్గము ముగిసెను.

ష్వాభేదే రాజజమ్బూః
ర్జూరకేఽపి సా,
ఇతి బాన్తాః.

రాజజంబూః-సీ॥ ఇది నేరేడుయొక్క భేదమునకును, ముద్ద ఖర్జూరమునకును పేరు.

బాంతపదవర్గము ముగిసెను.

---

వష్టమ్భ స్త్వస్తబ్ధతాయాం
మ్నిగర్వేఽవలేపనే.
ఇతి భాన్తాః.

అవష్టంభః-పు॥ ఇది స్తబ్ధభావమునకును, బంగారమునకును, గర్వమునకును, పూయుటకును పేరు.

భాంతపదవర్గము ముగిసెను.

---

భ్యాగ మోభ్యాగమనే
త్సఙ్గర సమీపయోః,
ార్వభౌమ స్సర్వపృథ్వీ
ంకే దిగ్గజాన్తరే. ౯౯
పక్రమ స్స్యా దుపధా
త్సారమ్భవాచకః,
హాపద్మో నాగభేదే నిధి
ఖ్యావిశేషయోః. ౧౦౦
శ్వకర్మా సహస్రాంశౌ దేవ
ని వేధసి,
ాతప్రమీర్మృగేఽశ్వేఽ
శార్యోద్యోగే పరాక్ర
. ౧౦౧
ంగీకృతా వుపగమస్సమీ
మనేఽపి చ,
జ్యేష్ఠభ్రాత ర్యగ్రజన్మా
హ్మణే చాప్యథ త్రిషు.
యాతయామం గతరసే
ైభుక్తోజ్ఝితేఽపి చ,
ఇతి మాన్తాః.

అభ్యాగమః-పు॥ ఇది వచ్చుటకును, యుద్ధమునకును, సమీపమునకును పేరు.

సార్వభౌమః-పు॥ ఇది సమస్తభూమ్యాధిపతికిని, ఉత్తర దిక్కుననుండు దిగ్గజమునకును పేరు.

ఉపక్రమః-పు॥ ఇది అమాత్యాదులం బరీక్షించుటకును, వైద్యమునకును, ఆరంభమునకును పేరు.

మహాపద్మః-పు॥ ఇది సర్పభేదమునకును, నిధివిశేషమునకును, సంఖ్యాభేదమునకును పేరు.

విశ్వకర్మా-న్-పు॥ ఇది సూర్యునకును, దేవతలశిల్పికిని బ్రహ్మకును పేరు.

వాతప్రమీః-పు॥ ఇది పొడలయిఱ్ఱికిని, గుఱ్ఱమునకును పేరు

పరాక్రమః-పు॥ ఇది భయకారణముగలిగినను భయపడక నుండుటకును, కార్యారంభమునకును పేరు.

ఉపగమః-పు॥ ఇది అంగీకారమునకును, దాపును జెందుటకును బేరు.

అగ్రజన్మా-న్-పు॥ ఇది అన్నకును, బ్రాహ్మణునికిని పేరు.

యాతయామమ్-త్రి॥ ఇది పోయినరుచిగలదానికిని, చివికినదానికిని, అనుభవించి విడువంబడినదానికిని పేరు.

మాంతపదవర్గము ముగిసెను.

---

హలీన్దుజౌ రౌహిణేయౌ
భల్లసింహౌ గుహాశయౌ. ౧౦౩

రౌహిణేయః-పు॥ ఇది బలరామునికిని, బుధునకును పేరు.

గుహాశయః-పు॥ ఇది యెలుంగుబంటికిని, సింహమునకును పేరు.

దీర్ఘద్వేషేఽప్యనుశయః పశ్చాత్తాపానుబన్ధయోః,

అనుశయః-॥పు॥ ఇది దీర్ఘద్వేషమునకును, పశ్చాత్తాపమునకును, అనువర్తించుటకును పేరు.

సముదాయ స్సముదయో ద్వావిమౌ వృద్ధియుద్ధయోః.

సముదాయః-సముదయః ॥పు॥ ఈరెండును వృద్ధికిని, గదనకును పేళ్లు.

బాహులేయో వృషే స్కన్దే

బాహులేయః - ॥పు॥ ఇది ఎద్దునకును, కుమారస్వామి పేరు.

బాడబేయో ద్విజాశ్వయోః,

బాడబేయః-॥పు॥ ఇది బ్రాహ్మణునికిని, గుఱ్ఱమునకును పే

సమాహ్వయో నామ్ని యుద్ధే ద్యూతే చ పశుపక్షిభిః. ౧౦౫

సమాహ్వయః-॥పు॥ ఇది నామధేయమునకును, యుద్ధమునకును, పొట్టేలు, కోడి మొదలైన వానిచే నాడు జూదమునకును పేరు.

స్థూలోచ్చయ స్త్వసాకల్యే దన్తినాంమధ్యమేగతౌ,

స్థూలోచ్చయః-॥పు॥ ఇది సంపూర్ణముగాకయుండుటకు యేనుగులయొక్క తీవ్రము మందముగానినడకకును పేరు.

ధనఞ్జయోఽర్జునేశక్రే దహనే దేహమారుతే. ౧౦౬

ధనంజయః-॥పు॥ఇది అర్జునునకును,ఇంద్రునకును, అగ్నికిని, ముపోయినతర్వాతగూడ దేహమునువదలనివాయువునకును పే

సముచ్ఛ్రియ స్స్యాదుత్సేధే విరోధేఽపి

సముచ్ఛ్రియః - ॥పు॥ ఇది పొడవునకును, విరోధమునకు పేరు.

ప్రతిశ్రయః, సభాయాం చాశ్రయే చా

ప్రతిశ్రయః-॥పు॥ ఇది సభకును, ఆశ్రయమునకును పేరు

అవశ్యాయో హిమగర్వయోః. ౧౦౭

అవశ్యాయః-॥పు॥ ఇది మంచునకును, గర్వమునకును పేరు

సామ్పరాయ స్తు సమరే విపదాగామికాలయోః,

సాంపరాయః-॥పు॥ ఇది యుద్ధమునకును, ఆపదకును, భవ్యత్కాలమునకును పేరు.

అన్తశయ్యా శ్మశానే చ సా శయ్యాయాం మృతావపి. ౧౦౮

అంతశయ్యా-॥స్త్రీ॥ ఇది శ్మశానమునకును, మంచముమీద మరణమునకును పేరు.

గౌర్యశ్విన్యౌ దక్షకన్యే మదిరాఽపి హలిప్రియా,

దక్షకన్యా-॥స్త్రీ॥ ఇది గౌరికిని, అశ్వినీనక్షత్రమునకును పేరు.

హలిప్రియా-॥స్త్రీ॥ ఇది మద్యమునకును, ఆపిశబ్దముచేత రేవతీదేవికిని పేరు.

అన్వాహార్యం భవే న్మాసశ్రాద్ధమిష్టేశ్చ దక్షిణా.

అన్వాహార్యమ్-॥న॥ ఇది మాసశ్రాద్ధమునకును, ఇష్టియందుంచుదక్షిణకును పేరు.

భాగే భాగ్యే భాగధేయం దాయాదే తు పుమా

భాగధేయమ్-ఇది భాగమునకును, పూర్వకృతమైనశుభకర్మఫలమునకును పేరగునపుడు ॥న॥ ఇది భాగార్హుడైన దాయాదు

